# ధమ్మపదము

(బుద్ధ గీత)







చర్ల గణపతిశాస్త్రి

మొదటి ముద్రణము 1959
ప్రతులు 1000
రెండవ ముద్రణము 1995
ప్రతులు 1000

వెల: రూ॥ 10-00

చర్ల గణపతి శాస్త్రి
33 కిర్లంపూడి కాలనీ
విశాఖపట్నం
53002
ఫోను నెం. 575098



ముద్రణ:

లలితా ఆర్టు ప్రెస్సు,
టౌనుహాలు రోడ్డు,
విశాఖపట్నం - 1.

నియమ భాషణంబుల వాక్కు నిగ్రహించి
సత్యసంకల్పముల మదిన్ సంస్కరించి
కాయకర్మలఁ బాపంబు చేయకుండి
యార్షవథము త్రికరణపూణ్యముగఁ గొలువు.

నారాయణు గురున్ దేవున్
దండిన్ మ్రొక్కి వినమ్రతన్
ధమ్మపదంబు తెన్గింతూన్
నే గణపతి నాముఁడన్.

# సమన్వయము

ధర్మమునకు గ్లాని సంభవించి నప్పుడు లోకమందు భగవంతుఁడు అవతరించుననని భగవద్గీత చెప్పుచున్నది. భారతీయులు బుద్ధభగవానుని దొమ్మిదవ యవతారముగ నంగీకరించిరి. బౌద్ధజాతకకథలలో బుద్ధునిది చివరిజన్మ మనియుఁ బుద్ధుఁడు బోధిసత్త్వుని యవతారమనియుఁ జెప్పఁబడినది. అట్టి బుద్ధభగవానుని ధర్మప్రవచనములగు త్రిపిటకముల సారమె యీధమ్మపదము.

భారతీయులలో భగవద్గీత కెట్టి ప్రసిద్ధిగలదో యట్టి ప్రసిద్ధియె బౌద్ధులలో ఈ ధమ్మపదమునకును గలదు. ఒక్కొక్క మహాపురుషుని జీవితసాధనముఁ బట్టియు, ప్రచారమును బట్టియు ఒక్కొక్క యమూల్యరత్నము బహుళప్రచారములోనికి వచ్చుచుండును. సాధారణముగ లోకులు స్వయముగ ధర్మతత్త్వమును దెలిసికొన లేనివారై యుందురు. కాన వారు తమకాలమందలి మహానుభావుల మార్గము ననుసరించి నడచుచుందురు. ఆమహానుభావులు గతించిన పిదప జనులు వారి యాలాశయముల మఱచుటయుఁ గొంత కాలమునకు మఱి యొక మహానుభావుఁ డవతరించి వారిని దిరిగి మేల్కొల్పి ధర్మము నుపదేశించి తిన్నని మార్గమున నడచుచుండుటయు స్వభావమై యున్నది, మఱియు జనులుతమకుఁ బూర్వులైన, తమచే మహాపురుషులుగ గౌరవింపఁబడిన యాసత్పురుషుల ధర్మోపదేశముల వల్లించుటతోడను, వానిని బరుల కుపదేశించుటతోడను మాత్రమే సంతృప్తిచెంది యాచరణమూన్యులై

యుందురు. అందుచే వారిని మేల్కొల్ప నవతరించిన మహా పురుషులు ప్రాచీనధర్మమునే యా ప్రాచీనధర్మ గ్రంథ ప్రచారముద్వారాగాని, తమకాలపరిస్థితికిఁ దగినట్లు బోధించిన తమ ధర్మగ్రంథ సూక్తుల ద్వారాగాని ప్రబోధము సల్పుట మనము చూచుచునే యున్నాము.

కాన ఆయాకాలములలో ఆయా మహర్షులు అనేక ధర్మ శాస్త్రములు రచించి ప్రచారము చేయవలసి వచ్చినది. బుద్ధ భగవానుని కాలమున జనులు ఉపనిషదాది మహోదాత్త వాఙ్మయమును వల్లించువారైనను. అందలి యాశయముల ప్రకారము నడవక ధర్మాచరణమును సౌశీల్యమును మోక్షమును మఱచి హింసాయుతములును స్వర్గాదికామ్యకర్మ యుతములగు యజ్ఞములందుమునిగి కేవల బాహ్యాచారములతో సంతృప్తి చెందియు నవియే పరమపురుషార్థములని తలఁచి యుండుటచే ఆచరణమే, సౌశీల్యమే. నిర్వాణమే పరమపుషార్థముఁగ బుద్ధభగవానులు ధమ్మపదాది ధర్మ ప్రవచనముల ద్వారా బోధింపవలసి వచ్చెను.

బుద్ధుని పిదప బుద్ధుని శిష్యులలోఁ గొందఱు బుద్ధుని ధర్మతత్త్వమును సరిగా నర్థము చేసికొనక బౌద్ధమతమను పేరుతో అనేక హీనమతములను ప్రచారము చేయుటచే శంకరాచార్యులు ఆ మతములను ఖండించి యుపనిషత్తులు గీతమొదలైన యార్షగ్రంథములను దిరిగి ప్రచారములోనికిఁ దీసికొనివచ్చెను. కాని నిజమాలోచించినచో ఆర్షగ్రంథములకు బుద్ధుని యాశయములకు వైరుధ్యమంతగాఁ గానరాక పోవు

టయే గాక వాని యాశయ మొకటియేయని మనకుఁ దెలియక మానదు. బౌద్ధమతము పూర్వమీమాంసా, సాంఖ్యాది భారతీయదర్శన మతములవంటి యొకశాఖయె గాని తద్విరుద్ధమైన దియుఁ దదన్యమైనదియుఁగాదు. బుద్ధునిమతము అర్షమత విరుద్ధమైన దను వాడుక యుండుటచేఁ దద్విరుద్ధము కాదనుటకుఁ గొన్ని యుదాహరణము లిటఁ జూపఁబడుచున్నవి.

పురాణములందువలె ఈ ధమ్మపదమందును "సుశిక్షితుఁడే యమలోక స్వర్గలోకములను గెల్చునని" (ధమ్మపద 44 పద్యము) లోభులు దేవలోకమును బొందలేరని (ధమ్మపద 183 )ఇహలోకమునుండి పరలోకమునకుఁ బోయినవారిని వారి పుణ్యము లాహ్వానించు నని(ధ॥ 220 ) యమదూతలు నీకై సిద్ధముగా నున్నారు ఇప్పటికైన ధర్మమాచరింపు మని ( ధమ్మ 235 ) దివ్యమానుష భోగములను విడువుమని [ధ 417 ] ఆయాచోట్ల వర్ణింపఁబడియున్నది,

భగవద్గీతాదులందువలెనే యిందును "అనికేతస్థితి (ధమ్మ 87, 404) ఆత్మజయము (105) ఇంద్రియనిగ్రహము [361 ద్వంద్వాతీతస్థితి [407] అప్రతిగ్రహము [409] భూలోక స్వర్గలోక కామ్య కర్మ సంన్యాసము [410] అనాసక్తి, నిష్కామము [359,216] పుణ్యపాప సంగత్యాగము [412] కర్మ, వికర్మ [331] బ్రహ్మచర్యము [15 ,156] నిర్వాణము, [289] అమృతపదము [144] నైష్కర్మ్యము [232] ఆత్మోద్ధరణ [379, 330] మొదలగు విషయములు వర్ణింపబఁడెను.

ధర్మముతోఁ గూడిన యర్థకామములను సోపానములుగ గ్రహించిమోక్షసౌధము చెక్కవలయునని ప్రాచీనఋషులు ప్రబోధించిరి. కాలక్రమమున ధర్మాచరణము మాని కాషాయ వస్త్రజటాది బాహ్యవేషములు మాత్రమే వేయుచు మాటలతో ధర్మోపన్యాసములు చేయువారిని జూచి.

"తానె ముందుగ ధర్మంబు, చేయఁగావలెఁ; బిమ్మటన్ బోధింపవలె; నిట్లైన, బుధుండు కష్టమొందఁడు."

అని చెప్పి తాను జేసినదెకాని బోధింప నర్హత లేదనెను.

"ఓయి దుర్బుద్ధి : జడలున్ లేఁడిచర్మము నేటికిన్

అని యీవిధముగ బాహ్యవేషాదులను నిరసించి ధర్మాచరణ ప్రాధాన్యమును బోధించి ముని, బ్రాహ్మణాదిపదములకు సరియైన యర్థము చెప్పి ప్రాచీనములను ఋషిప్రబోధిత ధర్మమును బ్రశంసించెను. శ్రుతిస్మృత్యుక్తకర్మలు చేసినను అహింసాసత్యాఽస్తేయాదులైన యాత్మగుణములు లేనిచో బ్రహ్మసాయుజ్యమును బొందఁడని [గౌతమధర్మ 8,22] గౌతమ మహర్షియుఁ జెప్పెను.

కేవల జన్మచేతను బాహ్యవేషాదులచేతను దాము గొప్పవారమని తలఁచు బ్రాహ్మణాదులను సంస్కరించుటకు "గోత్రములచే జడలచేఁ గాఁడు బ్రాహ్మణుఁ; డెందుండున్ సత్యధర్మంబుల్, వాఁడె బ్రాహ్మణుఁడున్ శుచి" అని యీవిధమున బ్రాహ్మణవర్గమునఁ జెప్పెను. 'న కులేన న జాత్యాహి; క్రియాభిర్బ్రాహ్మణోభవేత్'' [కులముచేతను జాతిచేతనుగాక కర్మలవల్లనే బ్రాహ్మణుఁడగు] అని భారత, గీతాశాస్త్రములును దీనినే ధ్రువపక్షమున్నవి.

ధర్మాచరణమునే ప్రాధాన్యముగఁ జెప్పవలసి వచ్చుటచే బుద్ధుఁడు దేవుని పేరు ఎత్తలేదు గాన బుద్ధుఁడు దేవుఁడు లేఁడని చెప్ప ననఁదగదు. ఇంక బౌద్ధులు ఆత్మను అంగీకరింపలేదు. కాని పాపపుణ్యాది భోక్తృత్వాదులు కుదురుటకై చిత్త ప్రవాహ మను నింకొకదానిని అంగీకరించిరి. ఆత్మకుఁ జిత్త ప్రవాహమునకు నామములోనేగాని యితర విషయములలో అంతగా భేదములేదని తెలియవలయును.

ఈవిధముగ ఆర్షమత సమ్మతమైన బుద్ధుని యుపదేశము లను మనోవాక్కాయ కర్మలచే నాచరించి లోకులు నిర్వాణానందమును బొంది ధన్యు లగుదురు గాక.

ఇంక ఈ యనువాదములోని విషయమును గురించి చెప్పవలసి యున్నది. బుద్ధభగవానుఁడే ప్రదేశమున ఎవరితో ఏ సందర్భమున నుపదేశించెనో యాప్రదేశాదుల పేర్లు పద్యములకు మొదటఁ జెప్పఁబడెను.

ఇందు రెండు పంక్తులలో నున్న పద్యములు అనుష్టుప్పులు. దీనికిఁబాదములు అన్నిటికివలె నాలుగే. ప్రతిపంక్తి మధ్యఁగల కామాదగ్గఱ కొక పాదము పూర్తియగును. ప్రతిపాదమునకు ఎనిమిది యక్షరములుండును. దీనిని సంస్కృతమందలి యనుష్టుప్పువలెఁ జదువవచ్చును. ప్రతిపాదము చివర హ్రస్వమున్నచో సంస్కృతమందు వలె దీర్ఘముగాఁ జదువుకొనవలయును.

ఇంక నాలుగు పాదములు గల పద్యములలో తేటగీతి వలె నుండి స్వల్పభేదముగల మధురాక్కరలు గలవు. వీని యందుఁ ప్రాసము పాటింపఁబడలేదు.

ఇట్లు
చర్ల గణపతి శాస్త్రి.

# విషయసూచిక

# ధమ్మపదము

## 1. యమకవర్గము

స్థానము:-శ్రావస్తి 1 వ్యక్తి:-చక్షుపాలుఁడు (వృద్ధభిక్షువు)

మనసె ధర్మంపు మూలము; మనసె ముఖ్య;
మఖిల ధర్మంబులును మనోమయము సుమ్ము
మనసు చెడ, మాట చెడుఁ గర్మలును జెడును
నింక వ్యథ వెంటఁబడుఁ జక్రి మెద్దును బలె.

శ్రావస్తి 2 మట్టకుండలి

మనసె ధర్మంపు మూలము; మనసె ముఖ్య;
మఖిల ధర్మంబులును మనోమయము సుమ్ము
శుచిగ మనసున్న, నుడి, కర్మ శుచిగఁ దవరు
విడని నీడవోలె శుభంబు వెంటనంటు

శ్రావస్తి (జేతవనము) 3 ధుల్లతి (వృద్ధభిక్షువు)

"వీఁడు నన్దిట్టెఁ గొట్టెను, నన్ను జయించె దోచెను"
అని భావించెడి వారి, వైరంబు శాంతి పొందదు

4

"వీఁడు నన్దిట్టెఁ గొట్టెను, నన్ను జయించె దోచెను"
అని భావింపనివారి వైరంబు శాంతి పొందును

శ్రావస్తి (జేతవనము) 5 కాలీ

ద్వేషంబుచేత ద్వేషంబు, శాంతింపదిట యెన్నఁడున్
ప్రేమన్ ద్వేషము శాంతించు, నిది ప్రాచీనధర్మము

శ్రావస్తి (జేతవనము) 6 కోసంబిక భిక్షువు

ఎల్లకాలంబు నిందుంట, మని భావింప రజ్జులు
ఎల్లప్పుడుండ మంచెంచు, మేధావుల్ శాంతి గాంతురు

శ్రావస్తి 7 మహాకాలుండు

విషయరతుఁ జంచలేంద్రియ వశమనస్కుఁ
దిండిపోతు సోమరియై పరుండువాని
హీనబలుఁ గామదేవత యిట్టె గూల్చు
గాలి దుర్బలమైన వృక్షమును బోలె

8

విషయవిరతు, జితేంద్రియు, వశమనస్కు
మితముగ భుజించువరు, శ్రద్ధ మెలఁగువాని
అధికబలుఁ, గామదేవత కదపలేదు
కఠినమైన పర్వతమును గాలిపోలె

శ్రావస్తి (జేతవనము) 9 దేవదత్తుండు

సత్యమున్ దమమున్ లేక, రాగాదులఁ ద్యజింపక
కాషాయబట్ట గట్టుచో, దాని కాతఁ డనర్హుఁడౌ

10

రాగాది దోషముల్ వీడి, శీలంబుచేత శుద్ధుఁడై
సత్యమున్ దమమున్ బూనఁ; గాషాయబట్ట కర్హుఁడౌ

రాజగృహము (వేణువనము) 11 సంజయుండు

అసారంబున్ సారమని, సార మసార మంచును
మిథ్యాసంకల్పదర్శనుల్, గాంచి సారమెఱుంగరు

12

అసారంబ సారమని, సారంబున్ సారమంచును
సత్యసంకల్పదర్శనుల్, తెల్సి సారంబుగాంతురు

శ్రావస్తి 13 నందుఁడు [వృద్ధభిక్షువు]

ఇంటిపై కప్పు సరిగా, లేనిచో వాన చొచ్చును
నిగ్రహింపని చిత్తమం, దిట్లె రాగంబు చొచ్చును

14

ఇంటిపై కప్పు సరిగా, నున్నన్, జొరవు వానలు
నిగ్రహించిన చిత్తమం, దిట్లే చొరదు రాగము

రాజగృహము 15 చుందుఁడు

వగచుఁ బాపాత్ముఁడిహమున; వగచుఁ జచ్చి
యాతఁడిహ పరలోకంబులందు వగచు
మఱియుఁ దనదుష్టకర్మల నరసి యరసి
వగచుచుండు, వేదనలచేఁ బొగులుచుండు

శ్రావస్తి 16 ధమ్మికుఁడు

అలరుఁ బుణ్యాత్ముఁడిహమున; నలరుఁ జనియు
అందునిందు మోదముతోడ నలరుచుండు
అతఁడు తనదు సత్కర్మల నరసియరసి
మోద మొందుము మిగులఁ బ్రమోదమొందు

శ్రావస్తి 17 దేవదత్తుఁడు

పాపి యిటఁదపించుఁ, జనియుఁ దాప మొందు
నిహ పరంబుల మిగులఁ దపించుచుండు

అతఁడు పాపంబు చేసితి నని తపించు
దుర్గతిని బొంది యాతఁ డెంతో తపించు

18

ఇందుఁ బుణ్యాత్ముఁ డానంద మొందుఁ; జనియుఁ
బొందు ముద; మిందు నందు నానంద మొందు;
పొందితిని బుణ్య మనియు నానంద మొందు;
ఎందు సుగతిని బొంది యానంద మొందు;

శ్రావస్తి 19 మిత్రులగు నిరువురు భిక్షువులు

వరులగోవుల లెక్కించుబడుగుగొల్ల
వాని కేమాత్ర మధికారి గానియట్లు
అఖిలధర్మాల దొరలియు నాచరింప
నతఁడు నధికారి గాఁడు సంన్యాసమునకు

20

నిఖిలధర్మాలు చదువ కుండినను ధర్మానుసార
మాచరణ గల్గి ద్వేషరాగాదిదోషముల వీడి
ముక్తచిత్తుఁడై సుజ్ఞానయుక్తుఁడై యిహము పరము
నభిలషింపనివాఁడు సంన్యాసాధికారి యగును

ఇది
శ్రీ చర్ల నారాయణశాస్త్రి జనకగురువర కరుణాలబ్ధ
విద్యుఁడు వేంకమాంబా పుత్రుఁడు నగు
గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు
యమకవర్గము.

# ధమ్మపదము

## 2. అప్రమాద వర్గము

కౌశాంబి (ఘోషితారామము) 21 సామావతి (రాణి)

అప్రమాదంబె మోక్షంబు, ప్రమాదం బిదె మృత్యువు
అప్రమత్తుల్ నశింపరు, ప్రమత్తుల్ నశియింతురు

వివ:- అప్రమాదము=ధర్మమునఁ బొరపాటు పడకపోవుట.
అప్రమత్తులు=ధర్మవిషయమునఁ బొరపాటు పడనివారు.

22

ఈరీతి నప్రమాదంబున్, బాగుగఁ దెల్సి పండితుల్
అప్రమాదంబె వాంఛింతు, రార్యాచరణనిష్ఠులై

23

సంతతధ్యాను లౌధీరుల్, నిత్యశక్తియుతాత్ములై
పరమానందముం గూర్చు, నిర్వాణంబును గాంతురు

రాజగృహము 24 కుంభఘోసకుఁడు

యత్నశీలుండు జాగ్రత నలరువాఁడు
పుణ్యకర్మఁ, డాలోచించి పూనువాఁడు
నియమయుక్తుఁడు, సద్ధర్మనిరతజీవి
యప్రమత్తుండు వర్ధిల్లు నమలకీర్తి

రాజగృహము (వేణువనము) 25 చుళ్ళపంతకుఁడు (వృద్ధ భిక్షువు)

అలల్ ముంచఁ జిరీతిగ, జాగ్రత్తచేతఁ బూన్కిచే
యమంబుచే దమంబుచే, గట్టున్ మేధావి ద్వీపముల్

జేతవనము 26 బాలనక్షత్రఘుష్టుఁడు (హోలి)

మేధ లేనట్టిమూఢులు, ప్రమాదపడుచుందురు
మేధావి యప్రమాదంబున్, ధనముంబోలె దాచును

27

ప్రమాదాగ్నిం బడిపోక, కామవాంఛ విడన్వలెన్
అప్రమత్తత ధ్యానింపన్, గల్గు నత్యంతసౌఖ్యము

జేతవనము 28 మహాకస్సపుఁడు (వృద్ధభిక్షువు)

అప్రమాదంబుచేఁ బ్రమాదాంధకార
మడఁచి, మేధావి విజ్ఞానహర్మ్య మెక్కి
వెతను విడి, వీఁక జడుల దుఃఖితులవైపు
అద్రిగతుఁ డుర్విగతుఁ జూచు నట్లు చూచు

జేతవనము 29 మిత్రులగు నిరువురు భిక్షువులు

మత్తులం దప్రమత్తుండై, నిద్రితులం దనిద్రుఁడై
బక్కగుఱ్ఱాల శ్రేష్ఠాశ్వ, మట్లు ముందేఁగుఁ బ్రాజ్ఞుఁడు.

వైశాలీ [కూటాగారము] 30 మహాలీ

అప్రమత్తత నుండుటన్, దేవేశుఁ డయ్యె నిందుఁడు
అప్రమాదంబు శ్లాఘింత్రు, నిందింతురు ప్రమాదమున్.

జేతవనము 31 ఒక భిక్షువు

అప్రమత్తత నుండియేన్, బ్రమాద మన్నఁ గుందియేన్
భిక్షువు వహ్నియుంబోలె, సర్వబంధాలఁ గాల్చును.

జేతవనము 32 నిగమనివాసియగు తిస్సుఁడు

అప్రమత్తత నుండియేన్, బ్రమాద మన్నఁ గుందియేన్
భిక్షు వెందున్ బడిపోఁడు, నిల్చున్ నిర్వాణసన్నిధిన్.
వివ:- నిర్వాణము=మోక్షము.

ఇది శ్రీ.... .... .... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు అప్రమాదవర్గము.

# ధమ్మపదము.

## 3. చిత్త వర్గము

చాలిపర్వతము 33 మేఘియుఁడు

బాణకారుండు బాణాల, వంకర తీర్చు నట్టులన్
లొంగక నిల్వ కల్లాడు, చిత్తంబున్ జ్ఞాని దిద్దును.

34

గట్టుపైఁ బడ్డ మత్స్యంబు, గిల్గిల కొట్టుకొన్నతిన్
మది కొట్టుకొనున్ మారు, వలన్ దప్పించుకొంటకున్.
వివ:-మారుఁడు=రాగద్వేష మోహదేవత.

శ్రావస్తి 35

జయింపరానిదై వేగ, కోరిన చోటి కేగెడు
చిత్తమున్ వంచుటే మేలు, లొంగు చిత్తమె మేలిడున్.

శ్రావస్తి 36 ఒక జిజ్ఞాసువగు భిక్షువు

దర్శింపరాక జాణయై, కోరిన చోటి కేగెడు
మదిన్ నిల్పవలెన్ జ్ఞాని, నిల్చు చిత్తమె మేలిడున్.

శ్రావస్తి 37 సంఘరక్షితుఁడు

దూరమై యొంటిదై రూపు, లేక హృద్గుహ నుండెడు
చిత్త మాపు బుధుల్ కాము, పాశంబుల్ త్రెంచి వైతురు.

శ్రావస్తి 38 చిత్తహత్థుఁడు

చలచిత్తునకున్ ధర్మ, జ్ఞానంబు లేనివానికిన్
అప్రసన్న చిత్తునకున్, బూర్ణప్రజ్ఞ లభింపదు.

39

ప్రసన్నచిత్తుఁడై పాప, పుణ్యాదుల్ లేనివాఁడునై
నిశ్చలుండయి మేల్కొను, వాఁ డెట్టి భీతి పొందఁడు.

శ్రావస్తి 40 ఐదువందల విపశ్యకభిక్షువులు

ఘటమువలె టప్పు మను నెప్డొ కాయ మనుచు
మనసు నిఁకఁ గోటవలె దుర్గమం బొనర్చి
మారుతోఁ బ్రజ్ఞధను వూని పోరవలయును
గెలిచి మనసుఁ బ్రోచి యవాంఛ మెలఁగవలయు.

శ్రావస్తి 41 పూతిగత్తతిస్సుఁడు [వృద్ధభిక్షువు]

ఔరా! యీతుచ్ఛదేహంబు, వేగ చైతన్య శూన్యమై
వ్యర్థంబై దారువుం బోలె, మట్టిలోఁ బడి పోవును.

కోసలదేశము 42 నందుఁడు [గోపాలుఁడు]

ద్వేషికిన్ ద్వేషియున్ వైరి, వైరి కేమొనరించునో
యంతకంటెను చెడ్డయే, చెడ్డ చిత్తంబు చేయును.

కోసలదేశము 43 సోరయ్యుఁడు [వృద్ధభిక్షువు]

తల్లియుం దండ్రియుం గాని, యేబంధుల్ గూర్పఁ జాలని
శ్రేయస్సులను జేకూర్చున్, సత్పథిం బోవు చిత్తము.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధర్మపదమందు చిత్తవర్గము.

# ధమ్మపదము

## 4. పుష్ప వర్గము

శ్రావస్తి 44 ఐదువందల భిక్షువులు

యమలోకమ్మును సురలో
కము భూలోకము నెవండు గడఁగి జయించున్
సుమముల నేర్పరి యేరెడు
తమి నెవఁ డుపదిష్టధర్మతత్త్వం బెఱుఁగున్.

45

యమలోకంబును సురలో
కము భూలోకము సుశిక్ష ఘనుఁడే గెల్చున్
సుమముల నేర్పరి యేరెడు
తమిని సుశిక్షితుఁడె ధర్మతత్త్వం బెఱుఁగున్.

శ్రావస్తి 46 మరీచి (వద్ధభిక్షువు)

నురుగువలె నీశరీరము తఱిగి పోవు
నెండమావులవలె మిథ్య నుండు ననియు
నెఱిఁగి కామపాశముల ఛేదించి వైచు
నితఁడు యమరాజు దృష్టిలో నెపుడు పడఁడు.

శ్రావస్తి 47 విదూడభుఁడు

పూవులం దట్లు భోగాల, వ్యాసక్తచిత్తుఁ డౌజడున్
గ్రామముల్ ముంచువరదల్, వోలె మృత్యువు ముంచుమ.

శ్రావస్తి 48 కోసియవ్యాపారి

పూవులం దట్లు భోగాల, వ్యాసక్తచిత్తుఁడై మదిన్
గోర్కెలం దృప్తి చెందని, నరున్ యముండు లోఁగొనున్.

49

నిగ్గుల్ తావులు పోకుండఁ, దుమ్మెద నల్ప కెట్టుల
తేనె లాని చను, నట్టుల్, మౌని యూళ్ళఁ జనన్ వలెన్.

శ్రావస్తి 50 పాఠికుఁడు (సాధువు)

పరుల తప్పు, లన్యుల, కార్యాకార్యాలఁ జూడక
కార్యాకార్యాలు తమవే, యెప్పుడుఁ జూచుకోవలెన్.

శ్రావస్తి 51 ఛత్త్రపాణి (ఉపాసికుఁడు)

సుందరం బయ్యు నిర్గంధ, పుష్పంబు వ్యర్థ మౌనటుల్
ఆచరింపనివానికి, సూక్తులు విఫలం బగున్.

52

సుందరంబై సుగంధఁబౌ, పువ్వు సార్థక మౌనటుల్
ఆచరించెడి వానికి, సూక్తులు సఫలంబగున్.

శ్రావస్తి [పూర్వారామము] 53 విశాఖ [ఉపాసకురాలు]

పువ్వులతోడఁ జక్కని, మాలికల్ చేయు నట్టులన్
జన్మించుప్రతిమర్త్యుండు, చేయందగు సుకర్మలన్.

శ్రావస్తి 54 ఆనందుఁడు (వృద్ధభిక్షువు)

మంచిగంద మగురు పూలు మల్లె తావి
వాలువకె గాని చిమ్మపు గాలి కెదురు
ఈసుజనగుణగంధమె యెదురుఁ జిమ్ము
సజ్జనులె యెల్లెడ గుణముల్ చల్లుచుంద్రు.

55

అగరుల్ మంచిగంధంబు, నల్లఁ గల్వలు మల్లెలు
లోనగుగంధజాతిలో, శీలగంధమె శ్రేష్ఠము.

రాజగృహము [వేణువనము] 56 మహాకస్సపుఁడు

చందనాగురుగంధంబు, మిక్కిలి యల్ప మైనది
శీలవంతులగంధంబె, శ్రేష్ఠమై సోకు దేవులన్.

రాజగృహము [వేణువనము] 57 గోధికుఁడు [వృద్ధభిక్షువు]

సౌశీల్యవంతులై యుండి, జాగ్రతన్ విహరించుచున్
సుజ్ఞానముక్తు లౌవారి, నడ్డఁ జాలఁడు మారుఁడు.

జేతవనము 58, 59 గరహాదిన్నుఁడు

వీధులను బ్రోగు చేసిన పెంటఁ బుట్టి
లలితమై తావిఁ జిమ్ము గులాబి వోలె
జడులమధ్య నజ్ఞులమధ్యఁ బొడమి జ్ఞాని
స్వీయనిర్మలప్రజ్ఞ భాసిల్లు నెపుడు.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు పుష్పవర్గము.

# ధమ్మపదము.

## 5. మూర్ఖ వర్గము

శ్రావస్తి (జేతవనము) 60 దరిద్రసేవకుఁడు

నిద్రపట్టనివానికి నిశలు పొడవు
శ్రమ నలయువాని కొక్కయోజనమ పొడవు
విహిత మగుధర్మతత్త్వంపు మహితపదము
బాగెఱుంగని జడునకు బ్రతుకె పొడవు.

రాజగృహము 61 సార్ధవిహారి (శిష్యుఁడు)

సత్సాంగత్యము నెందును, యత్నించి పొంద కుంటివేన్
ఒంటిపై గట్టిగానుండు, మూర్ఖసాంగత్య మొందకు.

శ్రావస్తి (జేతవనము) 62 ఆనందుఁడు (వ్యాపారి)

పుత్రులున్నారు, డబ్బుండె, నాకని మూర్ఖుఁ డుల్కను
మేనే తనది కానప్పు, పుత్రు లేరి ధనం బెది.

జేతవనము 63 గిరిహటకచోరుఁడు

మూర్ఖుఁడై తన్ను మూర్ఖుఁగా, నెంచియున్ పండితుండెయౌ
పండితునిగఁ దన్నెంచు, వంఠ మూర్ఖుఁ డనంబడున్.

[శ్రావస్తి [జేతవనము] 64 ఉదాయి [వృద్ధభిక్షువు]

జీవించి నంతకాలము, మూర్ఖుండు జ్ఞానిఁ గొల్చియున్
తెడ్డు వంటరుచుల్ గాంచ, నట్లు ధర్మ మెఱుంగఁడు.

[శ్రావస్తి [జేతవనము] 65 భద్రవర్గీయము [భిక్షుసమూహము ]

బుద్ధిశాలి క్షణం బేని, విజ్ఞాని నాశ్రయించుచో
నాల్క వంటరుచుల్ గాంచు, నట్లు ధర్మ మెఱుఁగును.

రాజగృహము [వేణువనము] 66 సుప్పబుద్ధుఁడు
ఘోరఫలంబు చేకూర్చ, పాపకర్మలు చేయుచున్
దుర్బుద్ధులైనమూర్ఖులు, తమకుం దామె శత్రుపుల్.

జేతవనము 67 కస్సపుఁడు
కన్నీళ్ళు గాఱ నేడ్పించి, నరకయాతనఁ గూర్చుచున్
పశ్చాత్తాప పడంజేయు, కర్మలు చేయఁ బోకుమీ.

వేణువనము 68 సుమనుఁడు
ప్రసన్నచిత్తతన్ గూర్చి, యానందఫల మిచ్చుచున్
పశ్చాత్తాపము గూర్పని, కర్మలు చేయఁగావలెన్.

జేతవనము 69 ఉప్పలవణ్ణ (వృద్ధభిక్షురాలు)
పాపంబు పండ నందాఁక, నమృతం బనియెంచును
పాపంబు పండి నప్పుడు, మూర్ఖుండు దుఃఖితుండగున్.

రాజగృహము [వేణువనము] 70 జంబుకుఁడు [ఒక సాధువు]
మూర్ఖుండు ప్రతిమాసంబు, దర్భల్ ముట్టి భుజింపనీ
వాఁడు పొందఁడు ధర్మాత్ము, పదునాఱవపాలును.

వివ:- ఆత్మశుద్ధి లేకుండ దర్భలు ముట్టినంత మాత్రమునఁ
పవిత్రుఁడు గాఁడని భావము.

రాజగృహము [వేణువనము] 71 అహిపేతుఁడు
క్షీరంబువోలెఁ బాపంబు, వెంటనే గడ్డకట్టదు
బూది గప్పు నిప్పువోలె, మెల్లఁగా మండికాల్చును.

రాజగృహము (వేణువనము) 72 సట్ఠికూటుఁడు

మూర్ఖుల కెన్నిప్రజ్ఞలో, యున్న నవి యనర్థముల్
అవి మేధన్ బాడు సేసి, తచ్చిత్తశుద్ధిఁ జంపును.

జేతవనము 73 సుధమ్ముఁడు [వృద్ధభిక్షువు]

అసత్తు భావనం జేసి, భిక్షు గౌరవంబును
మఠాధ్యక్షత, యన్యుల, పూజల్ గోరు మూర్ఖుఁడు.

74

"ప్రవ్రజితులున్ గృహస్థు లెల్లరును నెపుడు
నేను జేసిన దెల్ల మన్నింతుర్ గాక
వారు నాదు కృత్యాకృత్యవశులె యగుత"
అని జడుని కిచ్ఛ గర్వంబు నతిశయిల్లు.

శ్రావస్తి [జేతవనము] 75 తిస్సుఁడు [వనవాసియగు వృద్ధభిక్షువు]

లాభములవైపు చేర్చుమార్గంబు వేఱు
పరమనిర్వాణమును జేర్చుపథము వేఱు
విశదముగ నిట్లు గని బౌద్ధభిక్షుకుండు
మెప్పులను గోరక వివేక మెన్నవలయు.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధర్మపదమందు మూర్ఖవర్గము.

# ధమ్మపదము.

## 6. పండిత వర్గము

జేతవనము 76 రాధుఁడు [వృద్ధభిక్షువు]

ధర నిధులఁ దెల్పుభూగర్భతత్త్వవేత్త
వలెఁ బరగుణదోషము లెంచి తెలుపువాని
మితవచనుని మేధావిఁ బండితునిఁ గొలువు
వానిఁ గొలువ మేలగును, బాపమును గనవు.

జేతవనము 77 అస్సజి, పునర్వసు

ఉపదేష్టయు శాస్తయు, దౌష్టమున్ మాన్పువాఁడును
వీరిష్టుల్ సజ్జనులకు, దుష్టులకో యనిష్టులు.

జేతవనము 78 ఛన్నుఁడు [వృద్ధభిక్షువు]

కొల్వకు పాపియౌమిత్రుఁ గొల్వకు పురుషాధమున్
గొల్వుము శిష్టుఁ డౌమిత్రుఁ, గొల్వు ముత్తమమానవున్.

జేతవనము 79 మహాకప్పినుఁడు [వృద్ధభిక్షువు]

ధర్మామృతమానుజనుల్, హాయి నిద్రింత్రు శుద్ధులై
ఆర్యోక్తధర్మ మందెప్డు, క్రీడించెదరు పండితుల్.

80

జలము నడపించు రైతు బోదెల నమర్చి
శరము సరిచేయుఁ గమ్మరి సాగఁ గొట్టి
దారువుల వంచు వడ్రంగి తఱుగఁ జెక్కి
నెమ్మనసు లోఁగొనును జ్ఞాని నిగ్రహించి.

జేతవనము 81 భద్దియుఁడు [వృద్ధభిక్షువు]

రాళ్ళదే గట్టి దౌకొండన్, గాలుల్ గదవ లేనటుల్
నిందాస్తుతు లవేమాత్రఁ, గదవన్ లేవు పండితున్.

జేతవనము 82 కాణమాత

గభీరం బౌ హ్రదం బెంతో, స్వచ్ఛమై కల్గ కున్నటుల్
ధర్మంబుల్ విని పండితుల్, ప్రసన్ను లయి యుందురు.

జేతవనము 83 ఐదువందల భిక్షువులు

ఎల్లచోట్లకు సజ్జను లేఁగుచుంద్రు
ఎపుడు భోగంబులను బ్రసంగింపఁబోరు:
దుఃఖములు మీఁదఁ బడినను, సుఖము గలుగఁ
గుప్పింగిపోవరు పండితు లుబ్బిపోరు.

జేతవనము 84 ధమ్మికుఁడు [వృద్ధభిక్షువు]

పరులకై గాని తనపనికొఱకుఁ గాని
కొడుకులను, డబ్బు, రాష్ట్రమున్ గోరఁబోఁడు
తనకు సంపదల్ గోరఁ డధర్మవృత్తి
నతఁడె ధార్మికుండు, సుశీలుఁ డతఁడె జ్ఞాని.

జేతవనము 85 ధర్మశ్రవణుఁడు

సంసారాంబుధి పారంబున్, జేరువా రేకొలందియో
తక్కినవారు గట్టునన్, గొట్టు మిట్టాడుచుందురు.

86

ఎవ్వారు తేటతెల్లంబౌ, ధర్మం బనుసరింతురో
వారు దుస్తరమృత్యూగ్ర, సంసారాబ్ధిం దరింతురు.

జేతవనము 87 ఐదువందల నూతనభిక్షువులు

దుష్టధర్మంబు వర్జించి, భావింపు శుద్ధధర్మమున్
ఇల్వీడి యనికేతుండై, దౌల నేకాకి గావలెన్.

దైన్యంబు లేక కామంబుల్, వీడి యొంటిగ నుండుచున్
చిత్తక్లేశంబులన్ ద్రోలి, తాను శుద్ధుండు గావలెన్.

ఇల దృఢముగ సంబోధ్యంగము లెద భావించి సరిగ;
నిడినం గైకోక యపరిగ్రహేచ్ఛావ్రతంబుం బూని
చిత్త మలముల క్షీణింపం జేసి ప్రకాశవంతు
లగుచు నుండెడివారె నిర్వాణపదంబు గాంత్రు.

వివ:- సంబోధ్యంగములు = 1 స్మృతి 2 ధర్మవిచయము 3 సామర్థ్యము, 4 ప్రీతి, 5 శాంతి, 6 సమాధి, 7 ఉపేక్ష. అపరిగ్రహేచ్ఛావ్రతము=ఒకరిచ్చినను దనకు అవసరము లేనిదానిని బుచ్చుకొనకుండుట యను వ్రతము.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేం దెనింగింపంబడిన
ధమ్మపదమందు పుష్పవర్గము.

# ధమ్మపదము

## 7. అర్హంత వర్గము

రాజగృహము [జీవకుని మామిడితోట] 90 జీవకుఁడు
కడఁ జనినవాఁడును వ్యథల్ గననివాఁడు
అన్నివిధములచే ముక్తుఁడైనవాఁడు
హృదయపాశాల ముడు లెల్లఁ దెంచువాఁడు
సెందు సంతాప మన్నది పొందఁడెపుడు.

రాజగృహము [వేణువనము] 91 మహాకస్సపుఁడు
స్మృతిశీలురు యత్నింత్రు. వారుండరు గృహంబులన్
హంసల్ గుంటల వర్జించు, నట్టు లిండ్లన్ ద్యజింతురు.

జేతవనము 92 వేలట్ఠిసీసుఁడు
ఎవరు కూడఁబెట్టరొ తెల్వి యెవరు తిండు
రగుణము, నహేతుక మగునిర్వాణపదము
బాగుగ నెవరు గాంతురొ వారిగతులు
మింటఁ బక్షులగతివోలె నంటరావు.

రాజగ్రహము [వేణువనము] 93 అనిరుద్ధుఁడు [వృద్ధభిక్షువు]
ఎవరు మితభుజుల్ రాగాదు లెవరు విడుతు
రగుణము నహేతుక మగునిర్వాణపదము
బాగుగ నెవరు గాంతురొ వారిపదము
మింటఁ బక్షులగతివోలె నంటరాదు.

శ్రావస్తి [పూర్వారామము] 94 మహాకచ్చాయనుఁడు
దృఢత సారధి గుఱ్ఱముల్ నడపునట్లు
ఎవ్వఁ డింద్రియముల వంచి ఋజుత నడపు

నెవఁడు మమత. రాగాదుల్ త్యజించు నట్టి
వాని దేవతలును గూడఁ బ్రస్తుతింతుర్.

జేతవనము 95 సారిపుత్త్రుఁడు [వృద్ధభిక్షువు]

పృథ్వివలె నోర్చుసంయమి వ్రితిఁ గనఁడు
ఇంద్రకీలాద్రివోలెఁ జలింపకుండు
హ్రదమువోలిక నెపుడు నిర్మలత నుండు
నతని సంసారదోషంబు లంట వెపుడు.

జేతవనము 96 కోసంభిభాషితతిస్సుఁడు [వృద్ధిక్షువు]

ప్రశాంతుఁ డైనవానికి, విముక్తి పొందువానికిన్
మనస్సు వాక్కు కర్మలు, శాంతమై యొప్పు నెప్పుడున్.

జేతవనము 97 సారిపుత్త్రుఁడు [వృద్ధభిక్షువు]

శ్రుద్ధివిశ్వాసములఁ బాఱఁదోలువాఁడు
మహితనిర్వాణపదమున మసలువాఁడు
బంధములఁ ద్రెంచి మఱి జన్మ పొంద నతఁడు
భోగవిముఖుఁడు నుత్తమపురుషుఁ డగును.

జేతవనము (ఖదిరవని) 98 రేవఁడు [వృద్ధభిక్షువు]

ఊర నున్న వని నున్నన్. బైనున్నన్ గ్రింద నున్నను
ఎం దార్హతుల్ విహరింతు. రాభూమియె మనోజ్ఞమౌ.
వివ :– అర్హతులు = జ్ఞానులు.

జేతవనము 99 ఆరణ్యకభిక్షువు

జవంబుల్ విహరింపని, సుందరారణ్యవాటులన్
వీతరాగులే క్రీడింత్రు; భోగులు గారు వా రిలన్.

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు అర్హంతవర్గము

# ధమ్మ పదము.

## 8. సహస్ర వర్గము

వేణువనము 100 తంబదాఠికుఁడు [చోరఘాతకుఁడు]
అర్థంబు లేనివేనవేల్, మాటల ప్రోవు కంటెను
విన నింపైనసార్థక, పద మొక్కటె శ్రేష్ఠము.

జేతవనము 101 దారుచీరియుఁడు [వృద్ధభిక్షువు]
అర్థంబులేని వేనవేల్, గాథల ప్రోవుకంటెను
విన నింపైనసార్థక, గాథ యొక్కటె శ్రేష్ఠము.

జేతవనము 102 కుండలకేసి [వృద్ధభిక్షువు]
అర్థంబు లేని వేనవేల్, గాథల్ భాషించుకంటెను
విన నింపైన ధర్మంపుఁ, బలు కొక్కటె శ్రేష్ఠము.

103

యుద్ధంబు నందు వేనవేల్, మర్త్యుల గెల్చుకంటెను
తనొక్కనినె గెల్చువాఁ. డుత్తమ యుద్ధజేతయౌ.

జేతవనము 104 105 అనర్థవుచ్ఛకుఁడు [బ్రాహ్మణుడు]
పరులగెల్చుకంటెను దన్నె గెలుచుకొనుట
శ్రేష్ఠము : వశియై నియతిఁ జరించువాని
గెలుపలేరు గంధర్వులు సురలు గాని
భావజుం డైన నాబ్రహ్మదేవుఁ డైన.

వేణువనము 106 సారిపుత్తునిమామ
నెలనెలను వేనవేల్ దక్షిణల నొసంగి
జన్మము లోకండు నూరేండ్లు సలుపు: నొకఁడు

ఎఱిఁగి క్షణమె శుద్ధాత్ముఁబూజించు; నట్టి
జన్మములకంటె క్షణము పూజయె వరంబు.

వేణువనము 107 సారిపుత్తుని యల్లుఁడు

వనమునందుండి నూఱేండ్లవఱకు నొకఁడు
సరిగ నగ్నికిఁ బరిచర్య సలుపు; నొకఁడు
ఎఱిఁగి క్షణమె శుద్ధాత్ముఁ బూజించు; నట్టి
క్షణికపూజ యాపరిచర్య కంటె మేలు.

వేణావనము 108 సారిపుత్తుని మిత్రుఁడు (బ్రాహ్మణుఁడు)

పుణ్యములఁ గోరి యొ' యేడు పురుషుఁడిందు
యజ్ఞముల హోమముల శ్రద్ధ నాచరించు;
యజ్ఞహోమాదికంబును నమలగుణుని
పూజలో నాలుగవవంతుఁ బోలలేవు.



అరణ్యవటి 109 దీఘాయుకుమారుఁడు



మ్రొక్కువానికి నిత్యంబు, పెద్దలన్ గొల్చువానికిన్
తేజ మాయువు, సౌఖ్యంబు, శక్తి యీనాల్గు వర్ధిలున్,

జేతవనము 110 సంకిచ్చుఁడు (సామణేరుఁడు)

దుష్టుండై చంచలాత్ముండై, నూఱేఁడ్లు మనుకంటెను
గుణియై ధ్యానియై యొక్క, రోజే మనుట చాలును.



జేతవనము 111 కొండఞ్ఞుఁడు (వృద్ధభిక్షువు)

దుర్బుద్ధియై చంచలుండై, నూరేండ్లుమనుకంటెను
ప్రాజ్ఞుఁడై ధ్యానియై యొక్క, రోజే మనుట చాలును.

జేతవనము 112 సప్పదాసుఁడు [వృద్ధభిక్షువు]

మందుండై శక్తిహీనుండై, నూరేండ్లు మనుకంటెను
స్థిరుఁడై శక్తుఁడై యొక్క, రోజే మనుట చాలును.

జేతవనము 113 పటాచార (వృద్ధభిక్షురాలు]

చావుఁబుట్టు లెఱుంగక, నూరేండ్లు మనుకంటెను
చావుఁబుట్టుల్ తెల్సియొక్క రోజే మనుట చాలును.

జేతవనము 114 కిసగోతమి

మోక్షపదం మెఱుగక, నూండ్లు మనుకంటెను
మోక్షమ్ము సెఱిఁగి యొక్క, రోజే మనుట చాలును.

జేతవనము 115 బహుపుత్రిక (వృద్ధభిక్షురాలు)

ఉత్తమధర్మ మెంచక, నూరేండ్లు మనుకంటెను
ఉత్తమధర్ముఁడై యొక్క, రోజే మనుట చాలును.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగిఁపఁబడిన
ధమ్మపదమందు పండితవర్గము.

# ధమ్మపదము

## 9. పాపవర్గము

జేతవనము 116 ఏకసాటకుఁడు (బ్రాహ్మణుఁడు)

పాపంబు వీడి పుణ్యంబున్, గావింప వేగిరింపుము
పుణ్యంబుచేయ జాగింపన్, పాపాల మది రంజిలున్.

జేతవనము 117 సేయ్యసకుఁడు [వృద్ధభిక్షువు]

ఎప్డో పావము చేసిన, నింకఁ బాపంబు చేయకు
పాపమం దిచ్ఛమానుము, పాపాల ప్రోగె దుఃఖము.

జేతవనము 118 లాజదేవునికన్య

ఎప్డో పుణ్యముఁ జేసిన, నింకం బుణ్యము చేయుము
పుణ్య మం దిచ్ఛపెంచుము, పుణ్యాలపోగె సౌఖ్యము.

జేతవనము 119 అనాధపిండికుఁడు [వ్యాపారి]

పాపంబు పండనందాఁకఁ బాపియున్ సౌఖ్యముల్ గనున్
పాపంబు పండినప్పుడె, పాపి కష్టంబులన్‌గనున్.

120

పుణ్యంబు పండనందాఁకఁ. బుణ్యుండున్ గష్టముల్ గనున్
పుణ్యంబు పఁడినప్పుడె, పుణ్యుండు పుణ్యముల్ గనున్.

జేతవనము 121 అసంయమి (భిక్షువు)

నాదుచెంతకుఁ బాపంబు రా దటంచు
పాపమును గూర్చి యశ్రద్ధ చూపరాదు
నీటిబొట్టొక్కటొక్కటె నింపుఁ గుండ
కొలఁదికొలఁది పాపమె పాపిఁ జలుపుఁ దన్ను

జేతవనము 122 బిలాలపాదుఁడు [వ్యాపారి]

నాదుచెంతకుఁ బుణ్యంబు రాదటంచు
పుణ్యమును గూర్చి యశ్రద్ధవూనరాదు
నీటిబొట్టొక్కటొక్కటె నింపుఁ గుండ
కొలఁది కొలఁది పుణ్యమె పుణ్యుఁ జలుపుఁ దన్ను.

జేతవనము 123 మహాధనుఁడు [వర్తకుఁడు]

బహుధనికుఁడై భటుల్ లేని వైశ్యవరుఁడు
భయద మగుమూలసందుల వదలునట్లు
బ్రతుకఁ గోరువాఁడు విషంబు వదలునట్లు
వదల వలె బాపమును శుభం బందువాఁడు.

వేణువనము 124 కుక్కుటమిత్రుఁడు

చేతిపైఁ బుండులేనిచో, విషంబున్ జేత ద్రోయనౌ
విషం బాచేతి కంటదు, శుద్ధునిన్ బాప మంటదు.

జేతవనము 125 కోకుఁడు [కుక్కలవేటాడువాఁడు]

ఎదురుగాలిపైఁ జిమ్మిన యెల్లదుమ్ము
కడకుఁదన మోము మీఁదనె పడెడురీతి
నవఘుఁడును దోషశూన్యుఁడౌ మనుజుపైని
పాపి చిమ్ము పాపము పాపిపైనె పడును.

జేతవనము 126 తిస్సుఁడు [వృద్ధభిక్షువు]

కొందఱు గర్భమున్ జొత్తురు, పాపుల్ నరకగాములు
పుణ్యాత్ముల్ స్వర్గమున్ గాంతురు, నిర్మలుల్ గాంతురు మోక్షమున్

జేతవనము 127 ముగ్గురు భిక్షువులు

ఆకసమునఁ గాని సముద్రమందుఁ గాని
కొండబిలములయందు దాగున్నఁ గాని
పాపములనుండి రక్షణ వడయుచోటు
లేదు లేదు లోకములో మఱెందుఁ గాని.

కపిలవస్తు [వ్యగ్రోధారామము] 128 సుప్పబుద్ధుఁడు శాక్యుఁడు
ఆసనమునఁ గాని నముద్రమందుఁ గాని
కొండబిలములయందు దాగున్నఁ గాని
మృత్యుముఖమునఁ బడకుండ నెసఁగు చోటు
లేదులేదు లోకములో మఱెందుఁ గాని.

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు పాపవర్గము

# ధమ్మపదము.

## 10. దండ వర్గము

జేతవనము 129 షవ్వగ్గియము [భిక్షుసముదాయము]

దండ మన్నను చావన్నన్, భీతిల్లు చుందు రెల్లరు
నీవలె నందఱం గాంచి. చంపింపకుము చంపకు.

130

శిక్షన్నన్ జీవి భీతిల్లు, జీవికిం దీపి ప్రాణముల్
నీవలె జీవులం గాంచి, చంపింపకుము చంపకు.

జేతవనము 131 అనేకబాలురు

జీవుల్ సౌఖ్యములం గోరు, నెవ్వండు స్వసుఖంబుకై
జీవులం జంపు నాతండు, చచ్చియున్ సౌఖ్య మొందఁడు.

132

జీవుల్ సౌఖ్యము లం గోరు, నెవ్వండు స్వసుఖంబుకై
జీవులం జంపఁడో వాఁడు చచ్చియున్ సౌఖ్యమొందును.

జేతవసము 133 కుండధానుఁడు [వృద్ధభిక్షువు]

నొవ్వం బల్కకు వల్కిన. నొవ్వం బల్కుదు రెల్లరున్
పరుషోక్తుల్ వ్యథం గూర్చు, నెదురున్ దిర్గు నీకవి.

134

బ్రిద్ద లౌకంచుపోలిక, నేమన్నన్ మౌన మూనుచో
నిర్వాణ మొంది నట్లౌను, నీకింకం బోరె యుండదు.

శ్రావస్తి [పూర్వారామము] 135 విశాఖాదులు [ఉపాసకురాండ్రు]

గొల్లండు కఱ్ఱచే గోవుల్, పొలంబు ద్రోలు వట్టులన్
జరాదేవియు మృత్యువున్. ద్రోలున్ ప్రాణులయాయువున్.

రాజగృహము [వేణువనము] 136 అజగరుఁడు [ప్రేత]

పాపంబు చేయుచున్ జీవి, చేయు చున్న ట్లెఱుంగఁడు
స్వకర్మచేతనే దుష్టుఁ, డగ్నిలోబలె మండును.

రాజగృహము [వేణువనము] 137 మహామోగ్గలాయనుడు [వృ॥భి॥]

సాధునిన్ గొట్టువాఁడును, నిర్దోషుం దిట్టువాఁడును
ఈ క్రింది పదికష్టంబు.లందేదొ వేగ పొందును.

138

తీవ్రవేదననో హాని, నంగ వైకల్యమో మఱి
దారుణవ్యాధినో లేక చిత్తవిక్షేపమో గనున్.

139

రాజదండననో లేక, దారుణనిందనో గనున్
బంధువు లైనఁ జత్తురు, భోగములో నశించును.

140

లేనిచో వాని యిండ్లెని, తగులం బడి పోపును
మేను వీడినతర్వాత, నరకంబునఁ గూలును.

జేతవనము 141 బహుభత్తికుఁడు [భిక్షువు]

గందపుంబూఁత జడలు దిగంబరతయు
కటికయుపవాసములు గాని, కటికనేలఁ
బండుటయు, వాసనాదులు, భస్మపూఁత
యెల్ల యివి వ్యర్థ, మాశల్ నశింపకున్న.

జేతవనము 142 సంతతి [మహామాత్య]

ఇట నలంకృతుఁడయ్యు జితేంద్రియుఁడయి
శాంతుఁడై దాంతుఁడై బ్రహ్మచారి యగుచు
ఎల్లప్రాణుల దయ చూచి యెసఁగువాఁడె
బ్రాహ్మణుఁడు వాఁడె భిక్షువు శ్రమణుఁ డతఁడె.

జేతవనము 143 పిలోతికుఁడు [వృద్ధభిక్షువు]

దుష్టకర్మలు గావింప, సిగ్గుపడున్ సుశీలుఁడు
భద్రాశ్వంబు కశన్బోలె, వాఁడు నిందను సైఁపఁడు

144

దెబ్బ తిన్న భద్రాశ్వంబుతీరున వేగ పూని
శ్రద్ధతో శీలమునను వీర్యముతో సమాధితోడ
ధర్మదృఢబుద్ధితోడ విద్యయు నాచరణయుఁ గల్గి
భయదదుస్తరసంసారబాధ నతిక్రమించు.

145

జలము నడపించు రైతు బోదెల నమర్చి
శరము సరిచేయుఁ గమ్మరి సాగఁ గొట్టి
దారువుల వంచు వడ్రంగి తఱుగఁ జెక్కి
నెమ్మనసు లోఁగొనును జ్ఞాని నిగ్రహించి.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు దండవర్గము.

# ధమ్మపదము

## 11. జరా వర్గము

జేతవనము 146 విశాఖయొక్క మిత్రురాలు

నిత్యమగ్ని కాల్చుచుండ, నవ్వేలఁ గుల్కు దేటికిన్
అంధకార మావరింపన్, వెదుక వేల దీపమున్

నివ :- అగ్ని = సంసారాగ్ని,

రాజగృహము (వేణువనము) 147 సిరిమ

పుండ్లతో రోగములతో, సంకల్పక్లేశపంక్తితో
నిండినచిత్రదేహమ్ముౕన్, జూడు నశ్వర మియ్యది.

జేతవనము 148 ఉత్తరి [వృద్ధభిక్షురాలు]

ఈమేను శీర్ణమై పోవు, రోగంపుటిల్లు నశ్వర
మెంతొ దుర్గంధియై కుళ్ళున్, చావె యంతము దీనికిన్.

జేతవనము 149 అధిమానుఁడు [భిక్షువు]

శరత్కాలంపు టానప, కాయట్లు పెంకు గట్టియున్
కపోతాస్థులఁ బోలుఁగీ, మేని కాశించు నెవ్వఁడు,

జేతవనము 150 రూపనంద (వృద్ధభిక్షురాలు)

రక్తమాంసాలు పూసిన, యస్థిపట్టన మియ్యది
వైర మాన జరా మృత్యు. లిందుఁ గాపుర ముండును,

జేతవనము 151 మల్లికాదేవి

రంగు రంగు రాజరథముల్ వ్రాలి పడును
మిసమిసని యౌవనపు మేను ముసలి దగును
పుణ్యధర్మంబు ముసలిదై ముడత వడదు
సజ్జనులఁ గూర్చి యిటు పల్కు సజ్జనంబు.

రాజగృహము [వేణువనము] 163 సంఘములోఁగలఁత
దుష్ట మౌమేలు గూర్పని. పనుల్ చేయుట చుల్కన
మంచివౌ. మేలు గూర్చెడు పనుల్ చేయుట కష్టము

జేతవనము 164 కాలుఁడు వృద్ధభిక్షువు]
ఆర్యులయు ధర్మజీవుల యార్హతులయుఁ
బ్రథితధర్మమున్ దుష్టుండు పాపదృష్టి
నరసి నిందించు నాత్మక్షయంబు కొఱకు
వెదురుపొద యాత్మహతికె పుష్పించుఁగాదె.

జేతవనము 165 కాలుఁడు [ఉపాసకుఁడు]
తాను జేసిన పాపంబె తన్ను మాలిన్యపఱచు
తాను జేసినపుణ్యంబె తన్ను విశుద్ధపఱచు
పాపపుణ్యము లెవరికి వారికె వేఱె యుండు
ఒకరి వొకరిని నెప్పుడు నుద్ధరింపఁగలేవు.

జేతవనము 166 అతాదత్తుఁడు [వృద్ధభిక్షువు]
అన్యుల గొప్ప మేలుకై, తన మేల్ వీడఁ గూడదు
తనమేలున్ దెల్పికొని, సత్కర్మ చేయఁగావలెన్.

ఇది శ్రీ..........గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు ఆత్మవర్గము

# ధమ్మపదము.

## 13. లోకవర్గము

జేతవనము 167 అల్పవయస్కుఁడగు నొకభిక్షువు

పాపంబు చేయఁగూడదు, ప్రమాదపడఁ గూడదు
మిథ్యాదృష్టిని వీడుము, సంసారంబును బెంచకు.

కపిలవస్తు(న్యగోధారామము) 168 శుద్ధోదనుఁడు

లెమ్ము ప్రమాద పడకు, సద్ధర్మ మాచరింపుము
ధర్మవర్తనుఁ డిందును, నందున్ నిద్రించు హాయిగా.

169

సద్ధర్మ మాచరింపుము, అధర్మ మాచరింపకు
ధర్మవర్తనుఁ డిందును, నందున్ నిద్రించు హాయిగా.

జేతవనము 170 ఐదువందల జ్ఞానులు (భిక్షువులు)

నీటిబుడగ రీతిగా, నెండమావుల తీరునన్
ఈలోక మెంచువానిని, మృత్యుదేవత గాంచదు.

రాజగృహము (వేణువనము) 171 అభయరాజకుమారుఁడు

రండు రాజపథం బట్లు, చిత్ర మౌభూమిఁ గాంచుఁడు
ఇందు మూఢుల్ తగుల్కొంద్రు, తగుల్కానరు జ్ఞానులు.

జేతవనము 172 సమ్మజ్ఞాని (వృద్ధభిక్షువు)

ముందున్ బ్రమాదపడియు, మీఁదన్ బ్రమాద మొందని
వాఁడు మబ్బువీడుచంద్రుఁ, డట్లు వెల్గించు లోకమున్.

జేతవనము 173 అంగుళిమాలుఁడు (వృద్ధభిక్షువు)

ఎవ్వఁడు తన పాపంబుల్, సత్కర్మన్ శుద్ధి చేయునో
వాఁడు మబ్బువీడుచంద్రుం, డట్లు వెల్గించు లోకమున్.

ఆలవి 174

ఈలోక మెల్లగుడ్డిది, చూడం గల్గుదు రొక్కరే
వలన్ విడ్డ పక్షివలెన్, స్వర్గంబు గాంతు రెవ్వరో.

జేతవనము 175 ముప్పది భిక్షువులు

హంసరాజము విహరించు నాకసమున
యోగబలమున వినువీధి యోగి తిరుగు
సైన్యములతోడ వచ్చిన స్మరుని గెల్చి
జ్ఞాని యిల వీడి తిరుగు నిర్వాణపథిని.

జేతవనము 176 చించుఁడు

ధర్మంబు మీఱువాఁడును, నసత్య మాడువాఁడును
వరంబున్ వీడువాఁడును, జేయని పాప మున్నదే.

జేతవనము 177 అయుక్తదానమును గూర్చి

లోభు లాదేవలోకముల్ పొందలేరు
మూఢులును దానమహిమను బొగడ లేరు
దానమున ధీరులో యనుమోదంబు చూపి
దానిచేతనె యందు మోదంబు గాంతు్రు.

జేతవనము 178 అనాథపిండికుని పుత్రుని మరణసందర్భమున

సార్వభౌమత్వముకంటెన్, స్వర్గంపుఁ బ్రాప్తికంటెను
త్రైలోక్యప్రభుతకంటెన్, నిర్వాణప్రాప్తి శ్రేష్ఠము.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు లోకవర్గము.

# ధమ్మ పదము.

## 14. బుద్ధ వర్గము

ఉరువేల 179 మాగందియుఁడు (బ్రాహ్మణుఁడు)

ఎవనిజయము సుస్థిరమై జయింప రాదొ
ఎవనిజయము రాగాదుల్ జయింపలేవొ
అందరాని కన్పింపని యంతులేని
యట్టి బుద్ధుపదము నెట్లు లందఁ గలరొ.

180

మోహజాలమున్ విషరూపుఁ బుడమిఁ బఱపు
తృష్ణ తనయిచ్ఛ నెవని నడ్పింపలేదొ
అందరాని కన్పింపని యంతులేని
యట్టి బుద్ధుపదము నెట్లు లందఁ గలరొ.

సంకాశ్యనగరము 181 దేవమనుజులు

ఎవ్వారు ధ్యానమగ్నులో, వేరు నైష్కర్మ్యశాంతులో
యాశ్రద్ధాఢ్యుల బుద్ధుల, దేవులున్ గాంచి మెత్తురు.

వారాణసి 182 ఏరకపత్తుఁడు (నాగరాజు)

మనుష్యజన్మ కష్టంబు, కష్టంబు దీర్ఘ మాయువు
ధర్మంబు వింట కష్టంబు, కష్టంబు జ్ఞానిజన్మమున్.

జేతవనము 183 ఆనందుఁడు (వృద్ధభిక్షువు)

ఏపాపము చేయకుంట, పుణ్యంబు లాచరించుట
స్వచిత్తనిగ్రహం బను, నీమూఁడు బుద్ధబోధలు.

184

ఎప్పుడును నోర్పు దాల్చుటె గొప్పతపసు
బుద్ధులు ప్రశాంతినే మోక్షముగ వచింత్రు
అన్యు హింసించువాఁడు సంన్యాసిగాఁడు
ప్రాణిహింస చేయనివాఁడె శ్రమణుఁ డనఁగ.

185

నింద సేయకుంట, యహింస, నియమరక్ష
యొంటిగాఁ గూరుచుంట, పరుండుటయును
అల్పముగ భుజించుట, చిత్తమందు యోగ
మూనుటయు నాఁగ నివి బుద్ధబోధనములు.

జేతవనము 186 చిరతాక్రాంతుఁడగు నొకభిక్షువు

బంగారువాన కురిసినన్, గోర్కెలం దృప్తి గల్గదు
భోగంబు లల్పసౌఖ్యంబుల్, దుఃఖంబు లని ప్రాజ్ఞుఁడు.
దివ్యభోగంబులన్ గూడ, వాంఛ యేమాత్ర ముంచక
తృష్ణాక్షయరతుం డౌను, సమ్యక్సంబుద్ధులశిష్యుఁడై.

జేతవనము 188 అగ్గిదత్తుఁడు (బ్రాహ్మణుఁడు)

మానవుల్ భీతితో ముగ్గి, కొండలను వనంబులన్
తోటలన్ జెట్లఁ జైత్యంబుల్, కడున్ శరణుఁ జొత్తురు.

189

క్షేమంబున్ శ్రేష్ఠమున్ గాదు, వీనిన్ శరణుఁ జొచ్చుట
వీనిన్ శరణుఁ జొచ్చుచో, సర్వబాధల్ నశింపవు.

190

ఎవ్వండు బుద్ధధర్మంబున్, సంఘంబున్ శరణొందునో
వాఁ డార్యసత్యముల్ నాల్గు, సత్యబుద్ధిఁ గనుంగొనున్.

వివ:_ఆర్యసత్యములు=దుఃఖము 2 దుఃఖసముదయము 3 దుఃఖ నిరోధము 4 దుఃఖనిరోధగామినియైన యుపసంపద.

191

దుఃఖంబున్ దుఃఖజన్మంబున్, సర్వదుఃఖవినాశమున్
దుఃఖంబున్ శాంతి పొందించు, నార్యాష్టాంగిక మార్గముల్.

వివ:- అష్టాంగికమార్గములు= 1 సమ్యక్‌దృష్టి 2 సమ్యక్ సంకల్పము 3 సమ్యక్ వాణి 4 సమ్యక్ కర్మాంతము 5 సమ్యక్ జీవిక 6 సమ్యక్ వ్యాయామము 7 సమ్యక్‌స్మృతి 8 సమ్యక్ సమాధి.

192

క్షేమంబు నుత్తమం బౌను, వీనిన్ శరణుఁ జొచ్చుట
వీనిన్ శరణుఁ జొచ్చుచో, సర్వబాధల్ నశించును.

జేతవనము 193 ఆనందుని ప్రశ్న

శ్రేష్ఠున్ గాంచుట కష్టంబు, శ్రేష్ఠుం డెల్లెడఁ బుట్టఁడు
అట్టి ధీరుండుపుట్టిన, యింటన్ సౌఖ్యమ్ము వర్ధిలున్.

జేతవనము వలువురు భిక్షువులు

బుద్ధజన్మంబు సౌఖ్యంబు, సద్ధర్మబోధ సౌఖ్యము
సంఘైకత్వము సౌఖ్యంబు, సంఘతపస్సు సౌఖ్యము.

195
పూజ్యులౌ బుద్ధులం గాని, లోకం బతిక్రమించి యా
శోకోపద్రవమున్ దాటు, బుద్ధశిష్యుల నైనను.

196
ఎందుండి భీతి పొందని, తృప్తుల నైనఁ గొలుచో
ఇంతిం తని యెవం డెన్న, రాని పుణ్యంబు గాంచును.

ఇది శ్రీ...........గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు బుద్ధవగ్గము.

# ధమ్మపదము.

## 15. సుఖవగ్గము

శాక్యనగరము 197 జాతికలహశాంతికై
వైరులన్ వైరముల్ లేక, యాహా! యెంత సుఖింతుము
స్నేహంబు గల్గి వైరుల, మధ్యనే విహరింతుము.

198
ఆర్తులం దార్తి లేకయే, యాహా! యెంత సుఖింతుము
ఆర్తులమధ్య సౌఖ్యంబు, చెల్వార విహరింతుము.

199
ఆసక్తు లందనాసక్తి, నాహా! యెంత సుఖింతుము
సక్తులమధ్య నాసక్తి, లేకుండన్ విహరింతుము.

200

మాయొద్ద నేమియున్, లేక యహా! యెంత సుఖింతుము
తృప్తియే మాకు నాహార, మాభాస్వరులకున్ బలెన్.

వివ:—ఆ భాస్వరు లనుదేవతలకు ఆనందమె యాహారముగాని ద్రవ్యాదులు గావు.

జేతవనము 201 కోసలరాజు

జయంబె పోరు పుట్టించు, జితుండు వగ గ్రుక్కును
జయాజయంబులన్ వీడి, శాంతుండె హాయి నుండును.

జేతవనము 202 ఒక కులకన్య

రాగమున్ బోలు నగ్నియు, ద్వేషమున్ బోలు పాపము
స్కందాలఁ బోలు దుఃఖంబుల్, లేవు శాంతిని బోల్ సిరుల్

ఆలవి 203 ఒక యుపాసకుఁడు

ఆఁకలే గొప్పరోగంబు, సంస్కారమె మహావ్యథ
వీనితత్త్వం బెఱింగినన్, నిర్వాణ మెంతొ సౌఖ్యమౌ.

జేతవనము 204 పసేనది కోసలరాజు

ఆరోగ్యమె మహాలబ్ధి, తృప్తియే గొప్పభాగ్యము
విశ్వాసంబె స్వబంధువు, నిర్వాణ మెంతొ సౌఖ్యము.

వైశాలి 205 తిస్సుఁడు (వృద్ధభిక్షువు)

వివేకామృతపాయియున్, బ్రశాంతామృతపాయియున్
ధర్మప్రేమామృతపాయి, శుద్ధుఁడై నిర్భయుం డగున్.

వేలువగ్రామము(వైశాలీసమీపగ్రామము) 206 సక్కుఁడు (దేవరాజు)

ఆర్యదర్శనభాగ్యంబు, సత్సాంగత్యము మేలిడున్
మూర్ఖులం జూడ కున్నచో, నిత్యంబు సౌఖ్య మబ్బును.

207

జడుల సహవాస మొందువాఁ డిడుమ లొందు
శత్రుతో వలె మూర్ఖుతో మైత్రి నెఱప
సంతతము దుఃఖ మగు; సాధుసంగమంబు
బంధుసంగమ మట్లు శుభావహంబు.

208

కనుక ధీరు బహుశ్రుతు జ్ఞాననిధిని
సత్ప్రవర్తను వ్రతనిష్ఠు సత్పురుషుని
హితుని నార్యు సద్బుద్ధిన్ భజింపవలయు
శీతరశ్మి యుడుపథిన్ భజించునట్లు.

ఇది శ్రీ ............ గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు సుఖవర్గము.

# ధమ్మపదము.

## 16. ప్రియవర్గము.

జేతవనము 209 ముగ్గురు భిక్షులు

అయోగ్యమార్గముం బొంది, యోగ్యమార్గంబు చేరక
మంచిన్ వీడి బ్రియ మ్మొందు, వాఁడు యోగ్యున్ గనన్వలెన్.

210

ప్రియంబు లప్రియంబులన్, జేరఁగాఁ బోకు మెన్నఁడున్
మంచిని జూడకుంటయుఁ, జెడ్డన్ జూచుట దుఃఖముల్.

211

కానఁ బ్రియంబు గోరకు, ప్రియనాశమె దుఃఖము
ప్రియ మప్రియమున్ లేని, వానికి లేవు బంధముల్.

జేతవనము 212 ఒక గృహస్థుఁడు

ప్రియంబుచే వ్యథల్ గల్గు, ప్రియంబుచే భయంబగున్
ప్రియంబె లేనివానికి, శోక మేది భయం బెది.

జేతవనము 213 విశాఖ (ఉపాసకురాలు)

ప్రేమచేఁ బుట్టు శోకంబు, ప్రేమచే భీతి పుట్టును
ప్రేమయే (ఆశయే) లేనివానికి, శోక మేది భయం బెది.

వైశాలి (కుటాగారశాల) 214 విచ్ఛవులు

భోగాశన్ బుట్టు శోకంబు, భోగాశన్ భీతి పుట్టును
భోగాశ లేనివానికి, శోక మేది, భయం బెది.

జేతవనము 215 అనిత్థిగంధకుమారుఁడు

కామేచ్ఛన్ బుట్టు శోకంబు, కామేచ్ఛన్ భీతి పుట్టును
కామేచ్ఛ లేనివానికి, శోక మేది భయం బెది.

జేతవనము 216 ఒక బ్రాహ్మణుఁడు

ఆశచేఁ బుట్టు శోకంబు, ఆశచే భీతి పుట్టును
ఆశయే లేనివానికి, శోక మేది భయం బెది.

రాజగృహము (వేణువనము) 217 ఐదువందల బాలురు

సుశీలున్, జ్ఞానసంపన్నున్, ధర్మాత్మున్ సత్యవాదిని
స్వకర్మరతుఁ డౌవానిన్, బ్రేమించెదరు లోకులు.

జేతవనము 218 అనాగామి
మోక్షంబున్ గోరువాఁడును, మోక్షసుస్థిరబుద్ధియున్
కామంబుల్ తెగ్రించువాఁడును, నూర్ధ్వస్రోతుఁ డనంబడున్.

ఋషివత్తనము 219 నందిపుత్త్రుఁడు
చిరంబు దూరమం దుండి, క్షేమంబ యిల్లు సేరిన
తమవానిన్ సఖుల్, బంధు లభినందింతు రెట్టులో.

220
అట్లె యీలోక మందుండి, పరలోకంబు చేరిన
పుణ్యాత్మున్ బంధునిం బోలె, నాహ్వానించును బుణ్యముల్.

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు ప్రియవర్గము.

# ధమ్మపదము.

## 17. క్రోధవర్గము.

కపిలవస్తు (న్యగ్రోధారామము) 221 రోహిణి
కోప మభిమానమును జంపుకొన్నవాని
ఎల్లబంధాల మొదలు ఛేదించువాని
నామరూపంబులకుఁ జిక్క నట్టివాని
నపరిగ్రహున్ దుఃఖంబు లంట వెపుడు.

అలవి (అగ్గాలవచైత్యము) 222 ఒక భిక్షువు
పర్వెత్తురథ మాపున, ట్లుప్పొంగుకోప మాపెడు
వానిన్ సారథి యందును, నన్యులు రశ్మిభూషణుల్.

రాజగృహము (వేణువనము) 223 ఉత్తర (ఉపాసకురాలు)

క్రోధంబున్ శాంతిచే గెల్వ, మంచిచేఁ జెడ్డ గెల్వుము
లోభిన్ దానముచేఁ గెల్వ, సత్యోక్తిన్ గెల్వ టక్కరిన్.

తవనము 224 మహామోగ్గలాయనుఁడు (వృద్ధభిక్షువు)

కోపింపకు సత్యమాడు, యాచింపన్ బీద కీయుము
ఈమూటిచేత మర్త్యుండు, సమీపించును దివ్యులన్.

సాకేత (అయోధ్య) 225 ఒక బ్రాహ్మణుఁడు

అహింసారతు లౌమాన్యుల్, కాయంబున్ నిగ్రహించియు
దుఃఖ మన్నదె లేనట్టి, మోక్షపదంబు గాంతురు.

రాజగృహము(గృధ్రకూటము) 226 రాజగృహశ్రేష్ఠి కుమారుఁడు

సదా మేల్కొన్నవారల, సదా సాధించువారల
నిర్వాణ మొందువారల, యాస్రవంబుల్ క్షయించును.
వివ:—ఆస్రవములు=కామము, జన్మము, అవిద్య.

జేతవనము 227 అతులుఁడు (ఉపాసకుఁడు)

ఊరక కూరుచుండిన, వానిన్ నిందింత్రు లోకులు
వాగువానిని నిందింత్రు, నిందింత్రు మితభాషిని.

227 (క)

లోకంబునందు నిందలఁ, బొందనివాఁడు లేఁ డెటన్
అతులా! యిది నేఁటిదా, పూర్వమునుంచి యున్నదే.

228

ఎప్పుడున్ నిందఁబొందువాఁ, డెప్డు మెప్పొందువాఁడును
మున్ను లేఁడిప్పుడున్ లేఁడు, నింక ముందుండఁ బోవఁడు.

జేతవనము 229 అతులుఁడు (ఉపాసకుఁడు)

తప్పులు పట్టరానట్టి, ప్రజ్ఞాశీలుని జ్ఞానిని
రోజు రోజు పరీక్షించి, ప్రశంసింతురు విజ్ఞులు.

230

బంగారునాణెమున్ బోలె, వానిన్ నిందింప రెవ్వరు
ప్రశంసింతురు దేవతల్, బ్రహ్మ గూడను మెచ్చును.

వేణువనము 231 వజ్జియుఁడు (భిక్షువు)

మేనిచాపల్యమున్వీడి, మేనిని నిగ్రహించియున్
మేనిచేఁ జెడ్డ చేయక, మేనిచే మంచి చేయుము.

232

వాక్కుచాపల్యముల్ వీడి, వాక్కును నిగ్రహించియున్
వాక్కుచేఁ జెడ్డ పల్కక, వాక్కుచె మంచి పల్కుము.

233

మనశ్చాపల్యముల్ వీడి, మనసున్ నిగ్రహించియున్
మదిచేఁ జెడ్డ యెంచక, మదిచే మంచి యెంచుము.

234

మేనిని నిగ్రహించియు, వాక్కును నిగ్రహించియున్
మనస్సున్ నిగ్రహించియు, ధీరు లుత్తము లౌదురు.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు క్రోధవర్గము.

# ధమ్మపదము.

## 18. మలవర్గము

జేతవనము 235 గోఘాతక పుత్రుఁడు.

ఘండు టాకట్లు రాలపో నుండు దిపుడె
యమునిదూతలు నీకై తయారె యయితి
మతి ప్రయాణాభిముఖుఁడవై మనలునీకు
బాట నుపయోగపడుదారిబత్తె మేది.

236

ఇంక నైన ద్వీపమును నిర్మించికొనుము
యత్నశీలుండవై జ్ఞాని వయి సమస్త
దోషములఁ ద్రోలివైచి శుద్ధుండ వైన
నార్య లొందుదివ్యపదంబు నందఁ గలవు.

వివ:— సంసార సముద్రము ముంచకుండ ద్వీపమును నిర్మించుకొనవలయునని భావము.

237

వయసు చెల్లినవాఁడవై వఱలినావు
యమునిదగ్గఱకుఁ బ్రయాణ మయితి విపుడు
ఇఁక నివాసస్థలమును నీ కిచట లేదు
బాట నుపయోగపడుదారిబత్తె మేది.

238

ఇంక నైన ద్వీపమును నిర్మించుకొనుము
యత్నశీలుండవై జ్ఞాని వయి సమస్త
దోషములఁ ద్రోలివైచి శుద్ధుండ వైన
నవని నింక జరామరణములఁ బడవు.

జేతవనము 239 ఒక బ్రాహ్మణుఁడు.

కంసాలి పుటముల్ పెట్టి, వెండిన్ క్షాళించు నట్టులన్
మేధావి మెల్లనన్ దమ్ము, నెప్డున్ క్షాళించుకోవలెన్.

జేతవనము 240 తిస్సుఁడు (వృద్ధభిక్షువు)

ఇనుములో నుండి పుట్టిన యినుపత్రుప్పె
యినుమునె తినినశింపఁ జేసిన విధాన
సత్య మౌమార్గమును దప్పి చనెడివాని
వానికర్మలె తినుచుఁ బాపమున ముంచు.

జేతవనము 241 ఉదాయి (వృద్ధభిక్షువు)

లయ స్వరముఁ దప్ప మంత్రములకుఁ గళంకు
నెఱిఁ దుడిచి దిద్దకుంట యింటికిఁ గళంకు
నిండుసోమరితనము మేనికి గళంకు
ఇట స్వరక్షఁ బ్రమాద మొందుట గళంకు.

రాజగృహము 242 ఒక కులపుత్రుఁడు

కళంకు స్త్రీకి దుర్వృత్తి, యీర్ష్యకళంకు దాతకున్
కళంకు పాపకర్మంబుల్, జీవి కిహపరంబులన్.

243

అవిద్య యన్నిటిన్ మించు, కళంకు దుష్కళంకము
కళంకుల్ విడి యోభిక్షుల్! నిష్కళంకులు కం డిఁకన్.

జేతవనము 244 సారి

పాప మనసిగ్గు చెందనివాఁడు కాకి
చొప్పునను శూరుఁడును, పరసుఖవినాశి.
పతితుఁడును, స్వైరచారియౌ వాని బ్రతుకు
పైకి సుఖ మైన దుఃఖంబె వాస్తవముగ॥

245

పాప మన సిగ్గు చెందెడువాఁడు, మాంద్య
శూన్యుఁ, డమలసత్యాన్వేషి, శుద్ధజీవి
వినయవంతుండునై యొవ్వ జనుని బ్రతుకు
పైకి దుఃఖ మైన సుఖంబె వాస్తవముగ.

జేతవనము 246, 247, ఐదువందల యుపాసకులు

ప్రాణిహింసకుఁ, డనృతంబు పలుకువాఁడు
ఈయకుండ నన్యులది గ్రహించువాఁడు
పరసతిఁ గనువాఁడును, మద్యపానరతుఁడు
తామె తమయంతఁ దమగోయి త్రవ్వుకొందురు॥

248

ఈచంచలాత్ములన్ మర్త్యా!, పాపు లని యెఱుంగుమీ
నిన్న ధర్మంబు లోభంబున్, దుఃఖంబు పెట్టకుండుతన్.

జేతవనము 249 తిస్సుఁడు (బాలుఁడు)

తన ప్రసన్నతఁ దనశ్రద్ధ ననుసరించి
జనుఁడు దానంబు లెప్పుడుఁ జలుపుచుండు;
అందు నన్నపానము లిడనట్టివాఁడు
పవలు రాత్రి యైనఁ బ్రశాంతి పడయఁ బోఁడు.

250

పైని జెప్పిన దోషంబుల్, మూలచ్ఛేదము చేసిన
జనుండు రాత్రియుం బవల్, హాయిగా శాంతి నుండును.

జేతవనము 251 ఐదుగురు ఉపాసకులు

రాగంబుఁ బోలు నగ్నియు, ద్వేషంబున్ బోలు దయ్యమున్
మోహంబుఁ బోలు జాలంబున్, లేవు తృష్ణనుబోల్ నదుల్.

భద్దియనగరము (జాతియావనము) 252 మేణ్ణకుఁడు (శ్రేష్ఠి)
పరుల తప్పులఁ గాంచుట పరమసుఖము
కడఁగి తమతప్పు లరయుట కష్టతమము
ఇతరు తప్పులు పొల్లటు లెగురఁ గొట్టుఁ
దమవి దాచుఁ బాచికల జూదరియపోలె॥

జేతవనము 253 ఉజ్ఞానసంజ్ఞి (వృద్ధభిక్షురాలు)
నిత్యంబు పరదోషంబుల్ చూచి ధ్యానించువానికిన్
ఆస్రవంబులు వర్ధిల్లు, నశింప వాస్రవంబులు.
వివ— ఆస్రవంబులు=కామములు, ఆయా లోకములలోఁ బుట్టు
కోరిక, అవిద్య.

కుశీనగరము 254 సుభద్దుఁడు (పరివ్రాజకుఁడు)
ఆకసమునకు బాహ్యచిహ్నములు లేవు
శ్రమణునకు బహి రాడంబరములు లేవు
ప్రజలు లౌకిక విషయాభిలషితమ్మతులు
ఇఁకఁ దథాగతుల్ లౌకికాతీతమతులు॥

255

ఆకసమునకు బాహ్యచిహ్నములు లేవు
శ్రమణునకు బహిరాడంబరములు లేవు
ప్రాణికోటి శాశ్వత ముండు నదియె గాదు
బంధరహితు లౌవారె శాశ్వతమ యుంద్రు॥

ఇది శ్రీ ........... గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు మలవర్గము.

# ధమ్మపదము.

## 19. ధర్మస్థవర్గము.

జేతవనము 256 వినిచ్ఛయమహామచ్చుఁడు

ఆలోచింపక చేసెడి, వాఁడు ధర్మస్థుఁ డెట్లగున్
హితాహితంబులన్ జూచు, వాఁడె పండితుఁ డయ్యెడున్.

257

ధర్మంబుతోడ శాంతితోఁ, బ్రేమన్ ధర్మము తెల్పెడి
ధర్మరక్షితుఁ డౌమౌని, ధర్మస్థుఁ డనఁగాఁ బడున్.

జేతవనము 258 వజ్జియుఁడు (భిక్షువు)

మాటల్ గుప్పిన మాత్రానఁ, గాఁడు పండితుఁ డెవ్వఁడున్
భీతియున్ బగయున్ లేని, హితైషి పండితుం డగున్.

జేతవనము 259 ఏకుద్దానుఁడు (వృద్ధభిక్షువు)

వాక్కులను గుప్పి మిగుల నుపన్యసించి
నంతమాత్రాన ధర్మాత్ముఁ డగుట కల్ల
అల్పమేనియు విని ధర్మమాచరించి
ధర్మమందు జాఱని వాఁడె ధార్మికుండు.

జేతవనము 260 లకుంటకభద్దియుఁడు (వృద్ధభిక్షువు)

తల నెరసినఁతనే, పెద్ద గాఁడు మనుష్యుఁడు
వాని కాయువు నిండుట, వట్టిపెద్ద యనంబడున్.

261

దమంబు ధర్మమున్ సత్య, మహింస సంయమంబును
గల్గి దోషంబులన్ ద్రోలు, వాఁడె పెద్ద యనంబడున్.

జేతవనము 262 చాలమంది భిక్షువులు

వక్తయైనంతమాత్రాన, సుందరుండైనమాత్రివే
మాత్సర్యం, మీర్ష్య, మోసంబు, గల్గువాఁ డెట్లు సాధువౌ.

263

పైని జెప్పిన దోషంబుల్, మూలచ్ఛేదము చేసిన
మేధావి దోషముల్ వీడి, సాధూత్తముఁ డనంబడున్.

జేతవనము 264 హత్థకుఁడు (భిక్షువు)

చపలుండున్ మృషావాది, శ్రమణుండౌనె వ్రతహీనుఁడైయు
కామముల్ లాభముల్ గోరు, వాఁడు శ్రమణుఁ డెట్లగున్.

265

చిన్న పెద్దవి పాపంబుల్, శమింపఁ జేయు మర్త్యుఁడు
శమింపఁ జేయుటం జేసి, శ్రమణుం డనగాఁ బడున్.

జేతవనము 266 ఒక బ్రాహ్మణుఁడు

పరున్ భిక్షించు నంతనే, భిక్షువు గాఁడు మర్త్యుఁడు
విమర్శ లేక సర్వంబున్, జేయుచో భిక్షు వెట్లగున్.

267

పాపపుణ్యములన్ దాటి, బ్రహ్మచర్యము పూనియున్
జ్ఞానియై భువిఁ జరించు, వాఁడు భిక్షు వనంబడున్.

జేతవనము 268 తీర్థికుఁడు

జ్ఞానంబు లేని మూఢుండు, మౌన మూనిన మాత్రనే
ముని కాఁడు; మంచి చెడ్డల్, తూచి మంచి గ్రహించియున్.

269

పాపంబుల్ ద్రోలు ప్రాజ్ఞుండు, ముని యని యనంబడున్
ఇహపరమననంబున్, జేయుటన్ ముని యయ్యెడున్.

జేతవనము 270 అరియబాడిసకుఁడు

జీవిన్ హింసించు వానిని, నార్యుఁ డటంచుఁ బల్కరు
జీవిన్ హింసింప కుండినవాఁ, డార్యుఁ డనఁగాఁ బడున్.

జేతవనము 271 శీలసంపన్నులగు భిక్షులు

శీలంబుచే వ్రతమ్ముచే, బహుశాస్త్రాదిచింతచే
లేక సమాధిచేఁ గాని, యేకాంత సేవచే నను.

172

మూర్ఖుల కందఁగా రాని, నిర్వాణసౌఖ్య మొందఁగా
దోషముల్ పోవ నందాఁక, నో భిక్షు! నిద్రపోకుమీ.

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు ధర్మస్థవరము.

# ధమ్మపదము.

## 20. మార్గవర్గము

జేతవనము 273 ఐదువందల భిక్షువులు

మార్గములం దష్టాంగమ్ముల్, సత్యాల నార్యసత్యమ్ముల్
ధర్మంబుల విరాగమ్ము, మర్త్యులన్ జ్ఞాని శ్రేష్ఠులు.

వివ:— అష్టాంగములు=ధర్మమునకి క్రింది యెనిమిది యంగములు. 1 సమ్యగ్దృష్టి, 2 సమ్యక్సంకల్పము 3 సమ్యగ్వాణి 4 సమ్యక్కర్మాంతము 5 సమ్యగ్జీవిక 6 సమ్యగ్వ్యాయామము 7 సమ్యక్స్మృతి 8 సమ్యక్సమాధి. ఆర్యసత్యములు = 1 దుఃఖము 2 దుఃఖ సముదయము 3 దుఃఖనిరోధము 4 దుఃఖనిరోధగామినియయిన యుపసంపద.

274

జ్ఞానప్రాప్తి కింతకంటెన్, వేఱు మార్గము లేదిలన్
మీ రీమార్గమె పట్టుఁడు, మారున్ జంపున దియ్యదే.

మీ రీమార్గముఁ బట్టిన, దుఃఖంబులఁ దరింతురు
దోషశల్య మున్న చోటు, నేఁ దెల్సికొని చెప్పితిన్.

276

ఈదారిం బోవఁ బూనుఁడు, బుద్ధులో మార్గదర్శకుల్
ఈదారిం బోవు ధ్యానులు, మారు సంకెళ్ళు ద్రెంతురు

277

దృశ్యంబు లెల్ల నశ్యంబు, లని ప్రజ్ఞఁ గనుంగొని
వానియందు విరక్తుండౌ, చిత్తశుద్ధికి దా రిదే.

278

దృశ్యంబు లెల్ల నశ్యంబు, లని ప్రజ్ఞఁ గనుంగొని
వానియందు విరక్తుండౌ, చిత్తశుద్ధికి దా రిదే.

279

వస్తువులెల్లఁ దానుగా, వని ప్రజ్ఞఁ గనుంగొని
వానియందు విరక్తుండౌ, చిత్తశుద్ధికి దా రిదే.

జేతవనము                280   యోగతిస్సుఁడు (వృద్ధభిక్షువు)

లేవఁ గలిగి యుండియుఁ గూడ లేవ కుండి
శక్తు లయ్యు, యువకులయ్యు, జడులై యగుచు
చిత్తసంకల్పనాశంబు చేయ లేని
మందబుదులు జ్ఞానంబు పొందలేరు.

రాజగృహము (వేణువనము) 281

నియమభాషణంబుల వాక్కు నిగ్రహించి
సత్యసంకల్పముల మదిన్ సంస్కరించి
కాయకర్మలఁ బాపంబు చేయ కుంటి
యార్షపథము త్రికరణపూజ్యముగఁ గొలువు.

జేతవనము 282 పోఠిలుఁడు (ఒక వృద్ధభిక్షువు)

అభ్యసించుచో జ్ఞానోదయంబు కలుగు
అభ్యసింపనిచో జ్ఞాన మదె నశించు
శుభము నశుభము నిడు దార్లు చూచి సర్గ్గ
జ్ఞాన ముదయించు నటు తన్ను నడపవలయు.

జేతవనము 283 ఒక వృద్ధభిక్షువు

చెట్ట గా దడవుల్ గొట్టు, మడవియే భయం బిడున్
అడవుల్ పొదలున్ గొట్టి, భిక్షుల్! నిర్వాణ మొందుఁడీ.

వివ:— అడవులు=రాగాదులనెడి యడవులు.

284

స్త్రీలందున్ నరుని కున్న, కోర్కె పొద రవ్వంతయున్
ఛేదింప కున్నఁ బైకొనున్, గోవును దూడ వోలికన్.

జేతవనము 285 సువర్ణకారుఁడు (వృద్ధభిక్షువు)

కరముతో శరత్కాలంపుఁ గలువ నిట్టె
పెఱికి నట్లభిమానమున్ బెఱికివేయు
శాంతమూర్తి బుద్ధుఁ డుపదేశంబు చేయు
శాంతి పథమగు నిర్వాణసౌధ మెక్కు.

జేతవనము 286 మహాధనికుఁడగు వణిజుఁడు

"ఇచ్చటన్ వర్షకాలంబు, నిందు హేమంతగ్రీష్మముల్
ఉందు"నని జడుం డెంచు, నిందు విఘ్న మెఱుంగఁడు.

జేతవనము 287 కిసాగోతమి (వృద్ధభిక్షుకి)

నిద్రించు నూళ్ళ వరదల్; గొట్టుక పోవు నట్టులన్
పశుపుత్రాది మోహాంధున్, గొట్టుకపోవు మృత్యువు.

జేతవనము 288 పటాచార (వృద్ధభిక్షుకి)

తండ్రిగానీ సుతుల్ గానీ, జ్ఞాతియేన్ బంధు వేనియున్
మృత్యువు నోటిలోఁ బడ్డ, వానిన్ రక్షింపఁ జాలరు.

289

ఇట్టి యనర్థముల్ గాంచి, సుశీలుఁ డైన ప్రాజ్ఞుఁడు
నిర్వాణ మొందు మార్గంబె, వేగ శోధింపఁగా వలెన్.

ఇది శ్రీ........... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు మార్గవర్గము.

## 21. ప్రకీర్ణక వర్గము.

రాజగృహము (వేణువనము) 290 గంగావరోహణుఁడు

స్వల్పసౌఖ్యము వీడిన, మహాసౌఖ్యము గల్గుచో
మహాసౌఖ్యమె వాంఛించి, స్వల్పసౌఖ్యము వీడుమీ.

జేతవనము 291 ఒక పురుషుఁడు

అన్యులను దుఃఖపెట్టి, స్వసౌఖ్య మొందు మర్త్యుఁడు
వైరంబులన్ దగుల్గొని, యందుండి ముక్తి పొందఁడు.

భద్దియనగరము (జాతియావనము) 292 భద్దియుఁడు (భిక్షువు)

చేయందగ్గవి చేయక, చేయరానివి చేయుచున్
ప్రమత్తులైనపాపుల, యాస్రవంబులు వర్ధిలున్.

వివ:—ఆస్రవంబులు=కామములు, ఆయాలోకములందుఁ బుట్టు
కోరిక, అవిద్య.

293

తను వనిత్యము ముతికిది యనుచు నెపుడు
తలఁచువారు పాపము చేయఁ దలఁప లేరు
ఎపుడు మంచినె చేయుదు రిట్లు దలఁచి
జాగ్రతఁ జరించువారి యాస్రవము లడఁగు.

జేతవనము 294 లకుంటక భద్దియుఁడు (వృద్ధభిక్షువు)

ఆశయనుతల్లి, నభిమానమనెడి జనకు,
నిత్యత యనిత్యత యనెడి నృపులఁ జంపి
ద్వేష రాగాదిభటులతో వెలయుస్కంధ
రాష్ట్ర మోడించి శుచి యౌను బ్రాహ్మణుండు.

వివ:- నిత్యత=ఆత్మనిత్యత్వము, అనిత్యత=జగదనిత్యత్వము లేక జగన్మిథ్యాత్వము. స్కంధరాష్ట్రము=రూపము, వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము అను పంచ స్కంధములతోఁ గూడిన రాష్ట్రమును.

295

ఆశయనుతల్లి, నభిమానమనెడి జనకు
నిత్యత యనిత్యత యనెడి నృపులఁజంపి
అయిదుజ్ఞానావరణము లన్ వ్యాఘ్రములను
పట్టి చంపి పావనుఁ డౌను బ్రాహ్మణుండు.

వివ:- జ్ఞానావరణములు = 1 కామేచ్ఛ. 2 వ్యాపాదము= ద్రోహము 3 స్త్యానమృద్ధము=అలసత్వము 4 ఔద్ధత్యము= ఉద్వేగము, కౌకృత్యము=పశ్చాత్తాపము, 5 విచికిత్స= సందేహము.

రాజగృహము (వేణువనము) 296 దారుసాకటిక పుత్త్రుఁడు
రేయిం బవళ్ళు నిత్యంబు, బుద్ధుని సంస్మరించెడి
గౌతమశిష్యు లెప్పుడు, నుందురు జాగరూకులై.

297

రేయింబవళ్ళు నిత్యంబు, ధర్మమున్ సంస్మరించెడి
గౌతమశిష్యులెప్పుడు, నుందురు జాగరూకులై.

298

రేయింబవళ్ళు నిత్యంబు, సంఘమున్ సంస్మరించెడి
గౌతమశిష్యు లెప్పుడు, నుందురు జాగరూకులై.

299

రేయింబవళ్ళు నిత్యంబు, దేహమున్ సంస్మరించెడి
గౌతమశిష్యు లెప్పుడు, నుందురు జాగరూకులై.

300

రేయింబవళ్ళు నిత్యంబు, నహింసానిరతాత్ములౌ
గౌతమశిష్యు లెప్పుడు, నుందురు జాగరూకులై.

301

రేయింబవళ్ళు నిత్యంబు, భావనలోమునింగెడు
గౌతమశిష్యులెప్పుడు, నుందురు జాగరూకులై.

వైశాలి (మహావనము) 302 బజ్జిపుత్రకుఁడు (భిక్షువు)

ఇందు సంసారమును సంన్యసించుట కష్టతమము
ఉండ వీలు గల్గనియింట నుండుట దుఃఖకరము
అసముతో వసించుట, దోష మగుగతి దుఃఖకరము
కాన దోషముల్ విడుము దుఃఖంబులలోనఁ బడకు.

జేతవనము 303 చిత్తుఁడు (ఒక గృహస్థు)

శ్రద్ధయున్ శీలముఁన్ గీర్తి, సంపదల్ గలమర్త్యుఁడు
ఏయేదేశము వెళ్ళిన, నందందే పూజితుం డగున్.

జేతవనము 304 సభద్రుఁడు

సాధుల్ హిమాద్రి పోలిక, భాసింతు రెందు నున్నను
దుష్టుల్ భాసింప రిందున్నన్, రాత్రి వేయుశరా లటుల్.

జేతవనము 305 ఏకాకియగు వృద్ధభిక్షువు

ఒంటిఁ గూర్చుండి, యొంటియై, పరుండి, యొంటిఁ దిర్గుచున్
ఒంటిఁ దన్ను నియమించి, వనమం దుండఁగావలెన్.

ఇది శ్రీ ........... గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు ప్రకీర్ణకవర్గము.

# ధమ్మపదము.

## 22. నిరయవర్గము

జేతవనము 306 సుందరి (భిక్షుకి)

చేసియును జేయలే దని చెప్పువాఁడు
అనృత మాడువాఁడు నరకమందుఁ బడుదు;
రిరువురును గూడ నెపుడును హీనకర్ము
లగుటఁ జనిపోయి తుల్యమౌ వ్యథలఁ గాంత్రు.

రాజగృహము (వేణువనము) 307 పాపియగు మనుష్యుఁడు.

కాషాయబట్టలన్ గట్టి, చంచలుల్ పాపు లెందఱో
స్వపాపకర్మచేతనే, జన్మింత్రు నరకంబులో.

వైశాలి 308 వగ్గుముదాతీరవాసియగు భిక్షువు

స్వరాష్ట్రాన్నము దుష్టుండై, చలుండై తినుకంటెను
ఎఱ్ఱగాఁ గాల్చు నినుప, గుండే దినుట శ్రేష్ఠము.

జేతవనము 309 ఖేముఁడు (శ్రేష్ఠిపుత్త్రుఁడు)

మనుజుఁడు ప్రమాదమునఁ బరవనితఁ గలియఁ
బుణ్య మొందఁడు సుఖనిద్ర పొందఁ డెపుడు
నిందలను బొందు; ఘోరమౌ నిరయ మొందు
నిట్లు నాల్గువిధముల దుఃఖించుచుండు.

310

పుణ్యమా లేదు పాపమా పూర్ణ మగును
హడలి హడలుస్త్రీతో సౌఖ్య మల్ప మొందుఁ
గాని ఘోర మౌరాజశిక్షలను బొందు
నందుచే నరుల్ పరకాంతఁ బొందరాదు.

జేతవనము 311 కటుభాషి (భిక్షువు)

దర్భల్ జాగ్రత్తఁ గోయమిన్, జేతినే కోయు నట్టులన్
చెడ్డగాఁ జేయుసంన్యాస, ధర్మంబు నరకం బిడున్.

312

సరిగాఁ జేయని కర్మయు, భంగ మొందువ్రతంబును
పాడైన బ్రహ్మచర్యంబున్, మహాఫలంబు నీయవు.

313

చేయ నెంచినఁ జేయుము, చేయుచోఁ బట్టు పట్టుము
జాఱి పడిన సంన్యాసి, దుమ్మెంతో లేవఁ గొట్టును.

జేతవనము 314 ఈర్ష్యాళువయిన యొక స్త్రీ

చేయని పాపమే మేలు, చేయుచో ముందు గాల్చును
చేసిన పుణ్యమే మేలు, చేయుచోఁ జింత పొంతవు.

జేతవనము 315 పలువురు భిక్షువులు

ప్రభులు సరిహద్దుకోటలు పయిని లోన
రక్షణము చేయునట్లు పరీక్షణంబు
ఏమఱక తన్ను రక్షింప నెంచవలయు
క్షణము నేమఱినను నరకంబె కలుగు.

జేతవనము 316 జైనసాధువు

సిగ్గుపడరానిచోటుల సిగ్గు చెంది
సిగ్గుపడఁ దగుచోటుల సిగ్గు పడక
ఇట్టులు విరుద్ధముగ సంచరించు జనులు
పొందరాని యధోగతి పొందుచుంద్రు.

317

భయముపడరానిచోటుల భయము చెంది
భయము పడఁదగుచోటుల భయము పడక.
ఇట్టులు విరుద్ధముగ సంచరించుజనులు
పొందరాని యధోగతి పొందుచుంద్రు.

జేతవనము 318 తీర్థికుని శిష్యుఁడు

తప్పులెంచఁ దగనిచోట్లఁ దప్పు లెంచి
తప్పులెంచఁ దగినచోట్లఁ దప్పు గనక
ఇట్టులు విరుద్ధముగ సంచరించుజనులు
పొందరాని యధోగతి పొందుచుంద్రు.

319

చెడ్డను జెడ్డగాఁ జూచి, మంచిని మంచిగాఁ గని
సరియౌరీతిఁ జరించెడి, జనుల్ సద్గతి గాంతురు.

ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు నిరయవర్గము.

## 23. నాగవర్గము.

జేతవనము 320 ఆనందుఁడు

పోరన్ బైఁబడు బాణంబుల్, గజంబు సైచు నట్టులన్
కటువాక్కులనే సైతు, జనుల్ పెక్కురు దుష్టులే.

321

మప్పినయేన్గునే పోరన్, గైకొని నృపుఁ డెక్కును
యిట్లే పరుషవాక్యంబుల్, సైచుదాంతుండె శ్రేష్ఠుఁడు.

322

చక్క నేర్పినగుఱ్ఱంబుల్, కంచరగాడిదల్ కరుల్
శ్రేష్ఠంబుల్; వీనికంటెను, జితేంద్రియులె శ్రేష్ఠులు.

జేతవనము 323 మహానతభిక్షువు

ఆత్మనిగ్రహముంబోలె, నశ్వాదివాహనంబులు
మోక్షంబున్ జేర్పఁ జాలవు, దాంతుండె మోక్ష మొందును.

జేతవనము 324 పరిజిణ్ణ బ్రాహ్మణపుత్రుఁడు

సేనలను జెల్ల చెదరుల వేయుచుండి
యాపరాని యాధనపాల మనుగజంబు
ఎపుడు బంధింపఁబడె, నాఁడె యేమిఁ దినక
కవళములు మాని దుఃఖించు స్వవన మెంచి.

**వివ:—** బంధింపరాని గజము బంధింపఁబడి దుఃఖించునట్లు జీవి కామములచే బద్ధుఁడై దుఃఖించునని భావము.

జేతవనము 325 పసెనది (కోసలరాజు)

మిగుల సేమరియై మీఱి మెక్కుచుండి
నిదుర నిటు నటు దొర్లుచున్ లేవ లేక
పడి పరుండి మూర్ఖుడూరఁబంది వోలె
నొడలు పెంచుచు మఱిమఱి పొడముచుండు.

జేతవవము 326 సామణేరుఁడు

చెచ్చెర మనస్సు తనయిచ్ఛ వచ్చినట్లు
ఎక్కడికిఁ బడ నక్కడి కేగె మునుపు
గొలుసు త్రెంపిన యేన్గు నంకుశముఁతోడ
మావటీఁ డట్లు బంధింతు మనసు దృఢత.

జేతవనము 327 కోసలరాజుపావేయ్యకమను గజమునుజూచి

ప్రమాద మొందకుండుఁడు, మనస్సున్ రక్ష సేయుఁడు
ఊబినుండి కరిన్ బోలె, మిమ్ముద్ధరింపఁ బూనుఁడీ.

పారివేయ్యకము 328 పలువురు భిక్షువులు

ప్రథితసత్యశీలుఁడు పరిపక్వబుద్ధి
సాధువును ధీరుఁడును నైన సఖుని సాయ
మొందినయెడ సకలవిఘ్నములను ద్రోసి
స్మృతిఁ బ్రసన్నుఁడై వానితో మెలఁగవలయు.

329

ప్రథిత సత్యశీలుఁడు పరిపక్వబుద్ధి
సాధువును ధీరుఁడును నైన సఖుని సాయ
మొందనియెడ నోడిన రాజ్యమును త్యజించు
రాజువలె నొంటిఁ జను మిభరాజువోలె.

330

ఒంటియై సంచరించుట యుత్తమంబు
కాని జడుమైత్రి యెపుడు యుక్తంబు గాదు
వాంఛ విడి, పాపము త్యజించి వనమునందు
మదగజమువోలె నొంటియై మసలవలయు.

హిమవత్ప్రదేశము 331 మారుఁడు

సాయపడుదురు సఖు లవసరమునందు
ఒకరొకరు తృప్తి పొందుట సుకముకొఱకె
సుచరితము జీవితము తుది సుఖ మొసంగు
నఖిలదుఃఖనాశనమె మహాసుఖంబు.

332

మాతృసేవయె సౌఖ్యంబు, పితృసేవయు సౌఖ్యము
సంన్యాసంబును సౌఖ్యంబు, బ్రాహ్మణత్వము సౌఖ్యము.

333

ముదిమి దాఁక శీలంబున్, సత్యశ్రద్ధయు సౌఖ్యముల్
ప్రజ్ఞాలాభము సౌఖ్యంబు, పాపత్యాగము సౌఖ్యము.

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు నాగవర్గము.

# ధమ్మపదము.

## 24. తృష్ణావర్గము

జేతవనము 334 కపిలమచ్ఛుఁడు

ప్రమత్తబుద్ధికిన్ దృష్ణ, తీవియవోలె వర్ధిలున్
పండ్లకై క్రోఁతి పోలిక, ఫలేచ్ఛన్ దిర్గు నాతఁడు.

335

విషరూపిణియై పుట్టు, తృష్ణ పైఁబడ్డ వానికిన్
దుఃఖంబు లెల్ల వీడక, తుంగవోలిక వర్ధిలున్.

336

వారింపరాని యాతృష్ణన్, గెల్చిన వానిదుఃఖముల్
తామరాకున నీటిబొ, ట్లటులు జాఱి పోవును.

337

కాన నే మంచి చెప్పెద, నిందున్న మీర లందఱు
వట్టివేళ్ళకు గడ్డిని, బోలెఁ దృష్ణను ద్రవ్వఁడీ.

జేతవనము 338 గూథుఁడు సూకపోతికుఁడనువారు

ఇట్లు పెల్లగిరవనియెడఁ జెట్లు చెడక
పైనె నఱకుట మఱివ ఱి వర్ధిలునటు
తృష్ణ ప్రవేళ్ళతోఁ ద్రవ్వి ఛేదింపకున్న
మఱల వర్ధిల్లి దుఃఖమున్ దిరుగఁ దోఁడు.

339

ముప్పదియాఱు స్రోతస్సుల్, మర్త్యున్ వాంఛల ముంచును
రాగసంకల్పవాహినుల్, దుష్టున్ గొట్టుక పోవును.

వివ:— ముప్పదియాఱు స్రోతస్సులు=చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు ఇవి యైదును, వాని గుణములగు స్పర్శ, రూప, శబ్ద, రస, గంధములైదును, ధర్మము; మనోధర్మమును, చర్మము, కన్ను, చెవి, నాలుక; ముక్కు; మనస్సు అనెడి వీని విజ్ఞానములును మొత్తము పదునెనిమిది. ఇవి యన్నియు బాహ్యాభ్యంతర భేదములచే మొత్తము ముప్పదియాఱు.

340

ఈయేర్లు పాఱు నల్దిక్కు, లిందే తృష్ణాలతల్ గడున్
బైల్దేఱు; వేళ్ళతో వానిన్; బ్రిజ్ఞచేఁ బెల్లగింపుఁడీ.

341

అట్టి తృష్ణానదులు మనోహరము లగుచుఁ
బ్రాణి మనసు నాకర్షించి యలరుచుండు
అక్కతన జనుల్ వానిలోఁ జిక్కుకొనియె
మఱిగి సుఖము, గొందురు జరామరణములను.

342

ఆశ యనుపాశమున బద్ధులైన జనము
పరువు లిడుఁ బట్టువడ్డకుందేలు విధాన
బంధములఁ దగుల్కొని నట్టివారు చిరము
మరల మరల దుఃఖంబుల మరుగు చుంద్రు.

343

ఆశ యనుపాశమున బద్ధులైన జనము
పరువులిడుఁ బట్టువడ్డకుందేలు విధాన
వేగ వైరాగ్యమును బొందుభిక్షకుండు
తృష్ణను సమూలముగ ఛేదింపవలయు.

వేణువనము 344 విభ్రాంతకుఁడు (భిక్షువు)

బంధనము నుండి విడివడి బంధమునకె
తిరిగి చనుమర్త్యువోలిక దృష్టచేత
విషయవనినుండి యెటొ తన్ను వెలికి లాగి
కడకు నటె పోయి యటఁ జిక్కువడును జడుఁడు.

జేతవనము 345 బంధనాగారుఁడు.

రత్నముల, ధనంబులఁ, గుండలముల, సుతుల
నింతులను బంధముగ మది నెంచునట్లు
తాళ్లు బోనుల నినువసంకెళ్ళఁగాని
దృఢమయిన బంధముగ ధీరు లెంచఁబోరు

346

అట్టి బంధనములు దృఢమైన వనుచు
క్షయకర మని నింద్య మని దుస్త్యాజ్య మనియు
నెఱిఁగి విజ్ఞులు నందు నపేక్ష లేక
సకల భోగంబులను వీడి సంన్యసింత్రు.

రాజగృహము (వేణువనము) 347 ఖేమ (బింబిసారు పట్టమహిషి)

స్వయముగాఁ గట్టుకొని గూడు పట్టువరువు
లందె మరణించు గతి భోగు లాశఁజత్తు
రిది నఱికి ధీరు లచట నపేక్ష లేక
సకల భోగంబులను వీడి సంన్యసింత్రు.

రాజగృహము (వేణువనము) 348 ఉగ్గసేనుఁడు (శ్రేష్ఠి)

త్రికాలబంధముల్ త్రెంపి, సంసారాబ్ధిన్ దరింపుము
సర్వబంధ విముక్తుండు, జరామృత్యువు లొందఁడు.

జేతవనము 349 ధనుగ్గహపండితుఁడు

సందియంబుల నూఁగి నిశ్చలత లేక
ప్రబలరాగంబులను జిక్కి శుభము గనక
తిరుగువారికిఁ దృష్ణ వర్ధిల్లుచుండు
నిదియె దృఢముగ బంధించి వదల దెపుడు.

350

సందియముల వారించి నిశ్చలత నుండి
దృశ్యము లశుభము లని భావించువాఁడు
తెల్లముగ దోషముల నెల్లఁ దెలిసికొనుచు
నెపుడు వచ్చు బంధముల ఛేదించివైచు.

జేతవనము 351 మారుఁడు.

నైష్ఠికుండున్ నిర్భయుఁడున్, వీతతృష్ణుఁడు, శుద్ధుఁడున్
సంసారార్తిన్ విడున్; వీరి, కిదే చివరి జన్మము.

352

లూనతృష్ణుఁడు, దానముల్ గొననివాఁడు
భాష లెఱుఁగువాఁడు సుకావ్య ఫణితివిదుఁడు
మహిత శబ్దార్థ తత్త్వ నిర్మాత యింక
భవము గనరు, వీరిని మహాప్రాజ్ఞు లంద్రు.

వారణాశినుండి గయకుబోవుత్రోవలో 353 ఉపకుడు (అజీవకుఁడు)

అఖిలమును జయించినవాఁడ, నఖిలవిదుఁడ
అఖిలమౌ విషయములచే నంటఁబడను
అన్ని విడి, తృష్ణ విడి ముక్తి నందినాఁడ
నెల్లఁదెలిసిన నాకింక నెవరు గురువు.

జేతవనము 354 సక్కదేవరాజు
రుచుల నన్నింటి సద్ధర్మ రుచి జయించు
సకలదానాల ధర్మదానమె జయించు
రతుల నెల్లను సద్ధర్మరతి జయించు
అఖిల దుఃఖాలఁ దృష్ణాక్షయమె జయించు.

జేతవనము 355 అపుత్త్రికుఁడగు శ్రేష్ఠి.
సంసార మీదఁ బూనని, దుర్బుద్ధిన్ జంపు భోగముల్
భోగతృష్ణంబడి తన్నుఁ, జంపుకొనుఁ బరున్ వలెన్.

పాండుకంబలశిల (దేవలోకము) 356 అంకురుఁడు.
చేలన్ గలుపె దోషంబు, ప్రజన్ రాగమె దోషము
కావన్ విరాగి కిచ్చెడి, దానంబె సత్ఫలం బిడున్.

357
చేలన్ గలుపె దోషంబు, ప్రజన్ ద్వేషమె దోషము
కాన సద్వేషి కిచ్చెడి, దానంబె సత్ఫలం బిడున్.

358
చేలన్గలుపె దోషంబు, ప్రజన్మోహమె దోషము
కావన్ నిర్మోహి కిచ్చెడి, దానంబె సత్ఫలం బిడున్.

359
చేలన్ గలుపె దోషంబు, ప్రజన్ గామమె దోషము
కావన్ నిష్కామి కిచ్చెడి, దానంబె సత్ఫలంబిడున్.

ఇది శ్రీ .........., గణపతిశాస్త్రిచేఁ దెనిగింపఁబడిన
ధమ్మపదమందు తృష్ణావర్గము.

# ధమ్మపదము.

## 25. భిక్షువర్గము.

జేతవనము 360 ఐదువందల భిక్షులు

కంటిన్‌గెల్చుట మంచిది, మంచిది చెవిఁగెల్చుట
ముక్కున్ గెల్చుట మంచిది, మంచిది నాల్కఁగెల్చుట.

361

మనోవాక్కాయకర్మల, నిగ్రహించుట మంచిది
అన్నిటిన్ నిగ్రహించిన, భిక్షున్ దాఁకవు దుఃఖముల్

జేతవనము 362 హంసఘాతకుఁడు (భిక్షువు)

వాక్పాదపాణినిగ్రహు, నేకాకిన్ నిగ్రహోత్తమున్
అధ్యాత్మరతు, ధ్యానిని, సంతుష్టున్ భిక్షు వందురు.

జేతవనము 363 కోకాలియుఁడు

నోటిన్‌గట్టి వివిమర్శించి, పల్కు భిక్షు వగర్వియై
ధర్మార్థముల్ వెలిఁగించున్, తద్వాక్కుల్ మధురంబులు.

జేతవనము 364 ధమ్మారాముఁడు (వృద్ధభిక్షువు)

ధర్మారాముండయి ధర్మ, రతుండై ధర్మదర్శియై
ధర్మఁబునెంచు భిక్షువు, సద్ధర్మంబున జాఱఁడు.

రాజగృహము (వేణువనము) 365 విపక్షసేవకుఁడు (భిక్షువు)

లభించుదాని దూఱకు, మన్యుల దానిఁ గోరకు
అన్యుల దానినిన్ గోరు, భిక్షువు శాంతిఁబొందఁడు.

366

ఇచ్చినది రవంతైనన్, భిక్షుల్ వద్దనఁగూడదు
శ్రద్ధాజీవు నప్రమత్తున్, భిక్షున్ మెత్తురు దేవతల్.

జేతవనము 367 ఐదుగురు అగ్రదాయక భిక్షువులు

ఎల్లెడన్ నామరూపాల, సుంత మమత్వ మొందక
ఏమీలేకున్నఁ గుందని, వాఁడు భిక్షు వనంబడున్.

జేతవనము 368 పలువురు భిక్షువులు

మైత్రిన్ గ్రహించు భిక్షుండు, బుద్ధబోధన్ బ్రసన్నుఁడై
సర్వసంస్కారముల్ మాన్పు. శాంతానందగతిన్ గనున్.

369

ఈ జీవనౌక్షముంచెడు, రాగద్వేష జలంబులన్
తోడుమో భిక్షు! తేలికై, నిర్వాణతీరమున్ గనున్.

370

రాగ రూపాభిమాన గర్వావిద్యలైదునరకు
సంశ, అహంకృతి, సుఖ, కష్టవృత్త, హింసలణఁపు
శ్రద్ధ, శక్తి, స్మృతి, సమాధి, ప్రజ్ఞ లీతైదుద్వాలుచ్చె
ద్వేషరాగాదులై దింటి విడ నోఘతీర్ణుఁ డండ్రు.

పాఠాంతరము

ఐదు గోయు; మైదువిడు, మైదుభావింపు మంచివి.
ఐదు మైత్రిన్‌దాటు భిక్షుం, డోఘతీర్ణుం డనంబడున్.

371

మదిని ధ్యానింపు; భిక్షు! ప్రమాదపడకు
కోర్కెవలలో మది భ్రమింపకుండుఁగాక.
కాల్చిన యినుపగుండు మ్రింగకుము భ్రమను
నిది సయిపలేక వాగులకుండెదవుగాక॥

372

లే దజ్ఞానికి ధ్యానంబు, లే దధ్యానికి జ్ఞానమున్
జ్ఞానంబు ధ్యానమున్ గల్గు, వాఁడు నిర్వాణ మొందును.

373

శూన్యగృహంబు నందుండి, ప్రశాంతచిత్త మొందియున్
సద్ధర్మదర్శియౌ భిక్షు; వలోకానంద మొందును.

374

స్కంధాల చావుఁబుట్టుకల్, గాంత్రు జ్ఞాను లేటో యటి
యనుభవైకవేద్యంబౌ, నానందామృత మొల్కును.
స్కంధములు=రూపాదిస్కంధములు.

375

ప్రాజ్ఞులైనట్టి భిక్షువుల్ ప్రథమమందు
నింద్రియజయంబు, మఱి భిక్షు నియమరక్ష
తృప్తి గని; శుద్ధజీవిక; హితము శ్రద్ధ
కలుగు మిత్రుల నెప్పుడుఁ గొలువవలయు.

376

పరోపకారశీలుండై, ధర్మాచరణ సేవియై
నిత్యానందమున్ బొందు, వాఁడు దుఃఖాంత మొందును.

జేతవనము 377 ఐదువందల భిక్షులు

వసంతంబునఁ బూఁదీవె, వాడిన పూలు రాల్చును
ఇట్లె రాగంబు ద్వేషంబున్, రాల్చివేయుఁడు భిక్షువుల్.

జేతవనము 378 శాంతకాయుఁడు (భిక్షువు)
మనోవాక్కాయకర్మల, శాంతుఁడై ధ్యానమగ్నుఁడై
లౌకికంబుల్విడు భిక్షుఁ, డుపశాంతుఁడనంబడున్.

జేతవనము 379 లంగూలుఁడు (భిక్షువు)
ఆత్మచే నాత్మ శోధించి, యాత్మన్బ్రేరేచి యాత్మచే
ఆత్మచే నాత్మఁ బ్రోవఁగా, భిక్షు! క్రీడింతు హాయిగా.

380
ఆత్మయే యాత్మ కీశ్వరుఁ, డాత్మకు నాత్మయేగతి
కావున నాత్మ నిల్పుము, బేహారి గుఱ్ఱమున్ బలెన్.

రాజగృహము (వేణువనము) 381 వక్కలి (భిక్షువు)
అత్యంతానంది భిక్షుండు, బుద్ధబోధన్ బ్రసన్నుఁడై
సర్వసంస్కారముల్మాన్పు, శాంతానందగతిన్గనున్.

శ్రావస్తి (పూర్వారామము) 382 సుమనుఁడు (సామణేరుఁడు)
యువకుం డైన భిక్షుండు, బుద్ధోపదేశ మొందుచో
మబ్బువిడుచంద్రుఁడట్లు, భాసింపఁజేయు లోకమున్.

ఇది శ్రీ........... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
ధమ్మపదమందు భిక్షువర్గము.

# ధమ్మపదము.

## 26. బ్రాహ్మణవర్గము

జేతవనము 383 మిక్కిలి శ్రద్ధగల బ్రాహ్మణుడు

పూని తృష్ణానదిన్ బూన్చి, కోర్కెల్ ద్రోలుము బ్రాహ్మణా!
సంస్కారక్షతిఁ దెలియన్, బ్రాహ్మణ! ముక్తిఁగాంతువు.

జేతవనము 384 పలువురు భిక్షువులు

భావనన్ జిత్తజయమం, దంతు చూచి యెఱింగిన
బ్రాహ్మణు సర్వబంధంబు, నస్తమించును వెంటనే.

జేతవనము 385 మారుఁడు

ఈతలిగట్టు నాగట్టున్, రెండుగట్టులు దాటిన
నిర్భయున్ శూన్యసంకల్పున్, బ్రాహ్మణుం డని యందును.

వివ:—ఈతలిగట్టు=ఇంద్రియములు, ఆగట్టు=వాని విషయములు,
రెండుగట్లు=అహంకారమమకారములు.

జేతవనము 386 ఒకానొక బ్రాహ్మణుఁడు

ధ్యానిన్ శుద్ధున్ గృతకృత్యు, నాస్రవశూన్యు సుస్థిరున్
అత్యుత్తమార్థ సంప్రాప్తున్, బ్రాహ్మణుం డని యందును.

శ్రావస్తి (పూర్వారామము) 387 ఆనందుఁడు (భిక్షువు)

రవి పవలు వెల్గు; శశి రాత్రులందు వెలుఁగు
కవచ మూని క్షత్రియుఁడు విక్రమత వెలుఁగు
ధ్యానవిష్ఠలో వలనె బ్రాహ్మణుఁడు వెలుఁగు
బుద్ధుఁడో రేపవలు తేజమున వెలుఁగు.

జేతవనము 388 ఒక సంన్యాసి

పాపములను గడుగువాఁడు బ్రాహ్మణుండు
సమత నందఁగనువాఁడు శ్రమణుఁడగును
తనదుమాలిన్య మంతయుఁ దఱిమివై చి
వెలుఁగుటను బ్రవ్రజితుఁ డని పిలువఁబడును.

జేతవనము 389 సారిపుత్రుఁడు (భిక్షువు)

ఎపుడు బ్రాహ్మణు లెట్లు హింసింపరాదు
హింస చేయు బ్రాహ్మణుఁడు హింసింపరాదు
బ్రాహ్మణుని హింస చేయువా రధమజనులు
అధము హింసించు బ్రాహ్మణు లధమతములు.

390

ఇష్టములనుండి మనసు మళ్ళించుకొనుటె
బ్రాహ్మణునికి నత్యంత కళ్యాణకరము
హింసనుండి మన స్సెంత యెంత మరలు
నంతయంతగ దుఃఖంబు లంత మొందు.

జేదవనము 391 మహాపజాపతిగోతమి

మనోవాక్కాయకర్మలఁ, బాప మేమియుఁ జేయక
మనోవాక్కాయముల్ గెల్చు, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

జేతవనము 392 సారిపుత్రుఁడు (భిక్షువు)

బుద్ధుండు బోధచేసిన, ధర్మంబున్ దెల్పు భిక్షునిన్
అగ్నినిబోలె బ్రాహ్మణుఁ; డర్చించి మ్రొక్కఁగాఁదగున్.

జేతవనము 393 జటిలుఁడగు బ్రాహ్మణుఁడు

గోత్రములచే జడలచే, జాతిచేఁగాఁడు బ్రాహ్మణుఁ
డెందుండున్ సత్యధర్మంబుల్, వాఁడె బ్రాహ్మణుడున్ శుచి.

వైశాలి (కూటాగారశాల) 394 షాఖండుఁడగు బ్రాహ్మణుఁడు
ఓయిదుర్బుద్ధి! జడలున్, లేఁడిచర్మము నేటికిన్
నీలోన నంతయున్ కుళ్ళు, పైనిమాత్రమె తుడ్తువు.

రాజగృహము (గృధ్రకూటము) 395 కిసాగోతమి
చిరుగుప్రాఁతలు గట్టియున్, జిక్కి నరాలు గన్పడన్
ఒంటివైు వని ధ్యానించు, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

జేతవనము 396 ఒక బ్రాహ్మణుఁడు
బ్రాహ్మణస్త్రీకిఁ బుట్టు మాత్రమున నేను
బ్రాహ్మణుం డని యెన్నఁడు వాని నను
ధనికుఁ డేని వానిని నాహో యనఁగ వచ్చు
బ్రాహ్మణుఁ డన లేకయు గ్రహింపనియతండె.

రాజగృహము (వేణువనము) 397 ఉగ్గసేనుఁడు (శ్రేష్ఠి పుత్రుఁడు)
బంధంబు లెల్ల ఛేదించి, దేనికిన్ భీతి చెందక
నిష్కాముఁడై యసంగుండౌ, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

జేతవనము 398 ఇరువురు బ్రాహ్మణులు
సంకెళ్ళు తోలుపటకా, పాశంబుల్ ద్రెంపివైచియున్
తల్పుగడియ దీసిన, బుద్ధున్ బ్రాహ్మణుఁ డందును.
వివ:- సంకెళ్ళు=రాగద్వేషములనెడి సంకెళ్ళు, తోలుపటకా=స్త్రీవిత్తాది భోగాశయను పటకా, పాశములు=మతవాదములు, గడియ=అజ్ఞానము.

రాజగృహము (వేణువనము) 399 (అక్కోస) భారద్వాజుఁడు
తిట్లు, కొట్లును కట్లును, సహించుచు నదుష్టుఁడై
ఓర్పను సేనతోఁ గూడు, వీరున్ బ్రాహ్మణుఁ డందును.

రాజగృహము (వేణువనము) 400 సారిపుత్రుఁడు (భిక్షువు)
క్రోధశూన్యున్ వ్రతనిష్ఠున్, శీలవంతున్ బహుశ్రుతున్
దాంతు, నంతిమదేహుని, నేను బ్రాహ్మణుఁ డందును.

రాజగృహము (వేణువనము) 401 ఉప్పలవణ్ణ (భిక్షురాలు)
తామరాకున నీరట్లు, అంవపుంగొన నావగిం
జట్లు కోర్కెలసోకని, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

జేతవనము 402 ఒక బ్రాహ్మణ స్త్రీ
ఇందె బాధల్ దొలిలటట్లో, తెల్సికొన్న విరాగునిన్
సంసారభారమున్ ద్రోయు, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

రాజగృహము (గృధ్రకూటము) 403 ఖేమ (భిక్షురాలు)
గంభీరప్రజ్ఞు మేధావిన్, మార్గామార్గ విచక్షణున్
అత్యుత్తమార్థ సంప్రాప్తున్, బ్రాహ్మణుం డని యందును.

జేతవనము 404 (పబ్భారవాసి) తిస్సుఁడు (భిక్షువు)
సంన్యాసులన్ గృహస్థుల, నీయిర్వురను నంటని
యనికేతుని నిష్కామిన్, బ్రాహ్మణుం డని యందును.

జేతవనము 405 ఒక భిక్షువు
చరాచరంబులై నట్టి, ప్రాణుల్లన్ దయతోఁగని
చంపింపకయుఁ జంపని, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

జేతవనము 406 నల్వురు శ్రామణేరులు
వైరులందు నవైరుండై, దండ్యులందు నదండ్యుఁడై
గ్రాహులం దగ్రహీతయౌ, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

రాజగృహము (వేణువనము) 407 మహాపంథకుఁడు (భిక్షువు)
ఆవపుం గొన నుండిన, యావగింజట్లు రాగమున్
ద్వేషాభిమానవైరంబుల్, రాలన్ బ్రాహ్మణుఁడందును.

రాజగృహము (వేణువనము) 408 పిలిందవచ్ఛుఁడు (భిక్షువు)
కటువు వీడి యన్యులన్, బాధపెట్టక ప్రేమతో
సత్యంబు విన్నవించెడి, వానిన్ బ్రాహ్మణుఁడందును.

జేతవనము 409 ఒక వృద్ధుఁడు
చిన్నదేనియుఁ బెద్దదేన్, మంచిదేనియుఁ జెడ్డదేన్
ఈయకుండఁగఁ గైకోని, వానిన్ బ్రాహ్మణుఁడందును.

జేతవనము 410 సారిపుత్త్రుఁడు (భిక్షువు)
ఇహమందున్ బరమందున్, గోర్కెలులేని వానిని
ఆశ్రయశూన్య విష్కామున్, బ్రాహ్మణుండనియందును.

జేతవనము 411 మహామోగ్గలాయనుఁడు (భిక్షువు)
ఆసక్తి లేనివానిని, దెల్పి నిశ్చయమాడుచున్
అమృతస్నానముం జేయు, వానిన్ బ్రాహ్మణుఁడందును.

శ్రావస్తి (పూర్వారామము) 412 రేవతుఁడు (భిక్షువు)
పుణ్యపాపాలు రెండింటిన్, దాటినవాని శుద్ధుని
నిర్దోషున్ దుఃఖశూన్యుని, బ్రాహ్మణుండని యందును.

జేతవనము 413 చందాభుఁడు (భిక్షువు)
పున్నమిచందురుంబోలు, నిష్కలంకున్ బ్రసన్నుని
సంసారతృష్ణ లేకున్న, వానిన్ బ్రాహ్మణుఁడందును.

కుండియా (కోలియ) 414 సీవలి (భిక్షువు)
చావుఁబుట్టుల విషపు సంసారజలధి
మోహమును వీడి పారమున్ బొందువాని
ధ్యానిని, స్థిరు, నిస్సంశయుని, నమ్రుని, నెద్దియుఁ
గోనకె ముదమొందు వాని బ్రాహ్మణుండంటుందు.

జేతవనము 415 సుందరసముద్రుఁడు (భిక్షువు)
కామంబు లిందె వర్జించి, గృహంబు వీడిపోయియున్
కామజన్మక్షయంబొందు, వానిన్ బ్రాహ్మణుఁడందును.

రాజగృహము (వేణువనము) 416 జటిలుఁడు (భిక్షువు)
ఇందె తృష్ణన్ విసర్జించి, గృహంబు వీడిపోయియున్
తృష్ణాజన్మక్షయంబొందు, వానిన్ బ్రాహ్మణుఁడందును.

రాజగృహము (జేతవనము) 417 భూతపూర్వనట భిక్షువు
మానవ బంధముల్ వీడి, స్వర్గబంధము వీడియున్
సర్వబంధముల్ వీడు, వానిన్ బ్రాహ్మణుడందును.

418

సంతోషాసంతోషముల్ వీడి, ఏమియును గ్రహింపక
సర్వలోకముల్ గెల్చు, వానిన్ బ్రాహ్మణుడందును.

419

ప్రాణుల జన్మమృత్యువుల, సరిగా తెల్సికొనును
ఆశలేని సుగతుని, జ్ఞానిన్ బ్రాహ్మణుడందును.

420
ఎవని గతిన్ గంధర్వుల్, దేవుల్ మర్త్యులెరుంగరో
నిష్కాముని అర్హతుని, బ్రాహ్మణుడని యందును.

రాజగృహము 421 ధమ్మదిష్రవ (థేర)
ముందువెన్కలు మధ్యల్ ఏమియు లేనివానిని
ఇచ్చినన్ పుచ్చుకొవని, వానిని బ్రాహ్మణుడందును.

జేతవనము 422 అంగులిమాలుఁడు (థేర)
శ్రేష్ఠుని ముఖ్యమహర్షిని విజేతన్ బుద్ధు సుస్థిరున్
స్నాతకుని జ్ఞానవంతున్, బ్రాహ్మణుడని యందును.

జేతవనము 423 దేవహితుడు (బ్రాహ్మణుఁడు)
పూర్వజన్మ స్వర్గంబును, నరకంబును తెల్సియున్
క్షీణజన్ము పూర్ణప్రజ్ఞు, బ్రాహ్మణుడని యందును.



ఇది శ్రీ............ గణపతిశాస్త్రిచేఁ
తెనిఁగింపఁబడిన ధమ్మపదమందు
బ్రాహ్మణవర్గము.
సర్వము
సమాప్తము.